# ఆంధ్రపత్రిక



317251


The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 220 SATURDAY 13th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# "గ్రేట్ వాల్"కు దిగువన తీవ్రయుద్ధానికి కమ్యూనిస్టు కేంద్రీకరణ

## హ్సూచౌకుతూర్పున ప్రచండయుద్ధం

### ఉత్తరచైనానుండి అమెరికనుల ఖాళీ ఏర్పాట్లు

### యాన్ నాణెపు విలువ తగ్గింపు

నాంకింగ్, నవంబరు 12: చైనా రాజధాని నాంకింగుకు ముఖద్వార మనదగిన హ్సూచౌ పట్టణమునకు తూర్పుగా 70 మైళ్ళలో వున్న 'గ్రాండ్ కెనాల్'ను పెద్దపెట్టున దాటుటకు 80 వేల మంది కమ్యూనిస్టు సైనికులు ప్రభుత్వపటాలములతో హోరాహోరీ పోరాటము సాగించుచున్నవి. చైనారాజధాని భవిష్యత్తును ఈ సంఘర్షణ తేల్చివేయవచ్చు. హ్సూచౌ ప్రాంతంపై బ్రహ్మాండమైన దండయాత్రకు "గ్రేట్ వాల్"కు దిగువను కమ్యూనిస్టు సేనలు సమాయత్తమగుచున్నట్లు తెలుస్తున్నది.

నాంకింగ్-షాంఘై ప్రాంతముపై వచ్చి పడుచున్న కమ్యూనిస్టు మహా ప్రవాహమును అరికట్టుటకు ప్రభుత్వము ఉత్తరదిశగా బలీయమైన అదనపుసేనలను పంపుచున్నది. షాంఘై-నాంకింగ్ ప్రాంతమంతటిలోనూ చైనా ప్రభుత్వము నిన్న సైనిక శాసనమును ప్రకటించినది.

కేంద్ర చైనానుంచి కమ్యూనిస్టుసేనలు దక్షిణానికి అపారంగావచ్చుచున్నవి. షాంఘై-నాంకింగ్ ప్రాంతంలో కూర్చబడిన ప్రభుత్వసేనలు వీని నెదిరించి పోరాడుచున్నవి.

చైనా ప్రభుత్వానికి ఆయువు పట్టయిన షాంఘై—నాన్‌కింగ్ ప్రాంతంవద్ద కమ్యూనిస్టుసేనలను ప్రభుత్వసేనలు ఎదిర్చి పోరాడుచున్నవి. ఈ ప్రాంతంలో మిలిటరీ శాసనం అమలుజరిపినది మొదలు షాంఘై నగరంనుంచి ప్రజలు భీతావహులై పారిపోవుచున్నారు. బ్రిటిషుపౌరులను ఇచ్చటనుంచి తరలించుటకు బ్రిటిషు కాన్సలేట్ విమాన సౌకర్యాలను, నౌకాసౌకర్యాలను ఏర్పాటు చేసింది.

ఆర్థికదుస్థితి అనాటికానాడు విషమించుచున్నందున ప్రభుత్వము బంగారు యాన్ నాణెపు విలువను నిన్న తగ్గించివేసినది. ఒక్క అమెరికన్ డాలర్‌కు నిన్నటివరకు 4యాన్ నాణెముల చొప్పున మారకపురేటు ఉండెడిది; ఇది ఇప్పుడు 20 యాన్ నాణెములకు మార్చబడినది.

ప్రభుత్వచలామణి సంస్కరణల ఫలితంగా బంగారుయాన్ నాణెంవిలువ అయిదోవంతుకు తగ్గించబడినది.

రెండున్నర మాసాలకుముందు చైనీ డాలరు చలామణిని ప్రభుత్వం రద్దుపరిచి బంగారు యాన్‌నాణెమును ప్రవేశపెట్టింది. ఈ నాణెం మారకంవిలువ యునైటెడ్ స్టేట్సు డాలరుకు నాలుగునాణెముల చొ॥ నిర్ణయించబడింది. ఇప్పుడు డాలరుకు 20 నాణెముల చొ॥ మారకంవిలువ మార్చబడింది. బంగారం, వెండి, విదేశీ మారకాల నిలువచేసుకొనరాదని ఇదివరలో విధింపబడిన నిర్బంధం ఇప్పుడు తొలగించబడింది. ఇప్పుడు వెండినాణెములు కూడా చలామణి కాగలవు. ప్రభుత్వం స్వయంగా బంగారంకొను ఏర్పాటుకూడ చేయబడింది.

అయితే చలామణి సంస్కరణవల్లనే ఆర్థిక పరిస్థితి చక్కబడదనీ, ప్రస్తుత సంస్కరణలు ధూకంపాన్ని అరికట్టడానికి

[3 పేజి చూడుడు]

## రూర్ పరిశ్రమలు జర్మనీకి ఇవ్వరాదని ఫ్రెంచివాదం

### పశ్చిమరాజ్యాలకు నిరసన

లండన్, నవంబర్ 12: జర్మనీలో అత్యంత ప్రధాన పారిశ్రామిక మండలమైన రూర్ పరగణాలోని ఇనుము, ఉక్కు, బొగ్గు మొదలైన పరిశ్రమలను తిరిగి జర్మనులకు ఒప్పగించుటకు అమెరికా, బ్రిటన్‌లు చేసిననిర్ణయాన్ని ఫ్రాన్సు నిరసించినది. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియం, హాలండ్, లక్జెంబర్గు దేశాలు నిన్న ఇక్కడ ప్రారంభించిన సమావేశంలో మొదట జరిగిన విషయం, ఫ్రెంచి ప్రతినిధి ఆల్ఫాన్ తన ప్రభుత్వ నిరసనను ప్రకటించటమే. బుధవారంరాత్రి ఫ్రెంచి విదేశాంగ మంత్రి షూమాన్ ఇదే విధమైన నిరసనను పారిస్‌లోని బ్రిటిష్ రాయబారికి అందజేసెను. రూర్ పరిశ్రమలను అంతర్జాతీయ కంట్రోలుకిందనే ఉంచవలెనని ఫ్రాన్సు స్పష్టపరిచినది.

ఈ వైఖరినే బలపరుస్తూ ఫ్రెంచి రిపబ్లిక్ అధ్యక్షుడు ఓరియోల్, పార్లమెంటు అధ్యక్షుడు ఎరియోలు నిన్న కాంపీన్ దగ్గర 1918 సం॥ యుద్ధవిరమణదిన వార్షికోత్సవంలో ప్రసంగించిరి.

## బెర్లిన్‌కు సరుకుల సరఫరా

బెర్లిన్, నవంబరు 11: బెర్లిన్‌లో రష్యన్ అధికారుల బెదిరింపులనుకూడా పాటించకుండా బ్రిటిష్, అమెరికన్ భాగాలకు బ్రిటిష్ అధీనంలోని జర్మనీనుంచి అవసరపదార్థాలు విమానాలద్వారా వచ్చుచునేయున్నవి. నేడు పొగమంచు దట్టంగా ఆవరించినప్పటికీ రాడర్ యంత్రసహాయం ద్వారా పెద్ద విమానాలు ప్రయాణంచేసి బెర్లిన్‌లోని బ్రిటిష్ అమెరికన్ విమానాశ్రయాలకు వచ్చుచున్నవి.

రష్యన్ల లేఖను చదివిన నిపుణులు, రవాణా హక్కులు బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాలకు కలవన్నట్లు లేఖలో అంగీకరించబడినదని చెప్పిరి.

అమెరికన్ సైనిక కార్యాలయాధికారి కందిన లేఖవంటిదే బ్రిటిషుసైనిక కార్యాలయాధికారికికూడా రష్యన్ సైనిక కార్యాలయాధికారివద్దనుండి వచ్చినది. ఈ లేఖనుకూడా పరిశీలించుచున్నారు.

బెర్లిన్‌కు సరుకులు రవాణాచేసే విమానాలలో 808 ఒకటి చొ॥ మాత్రమే వారపాటున నిర్ణీతమైనదారితప్పి సోవియట్ భాగంలోకి ప్రవేశించుననీ, విమానాలన్నిటికీ స్పష్టమైన గుర్తులు ఎల్లప్పుడూ వుండుననీ, అందువలన రష్యన్ల బెదిరింపులను పాటించవలసిన అవసరంలేదనీ ఒక అమెరికన్ విమానదళ అధికారి చెప్పుచున్నాడు.

## నాయకత్రయ సమావేశం

### అనవసరమని ఆట్లీ అభిప్రాయం

### "సమితిని తోసిరాజనరాదు"

లండన్, నవంబరు 11: శాంతి సమస్యలను చర్చించుటకు అధ్యక్షుడు ట్రూమన్, జనరలిస్సిమో స్టాలిన్, బ్రిటిషుప్రధాని అట్లీలు సమావేశము కావాలని చేయబడిన సూచనకు బ్రిటిషుప్రధాని అట్లీ నేడు ప్రతికూలాభిప్రాయం ప్రకటించినాడు. పార్లమెంటులో ఒకప్రశ్నకు సమాధానమిచ్చుచూ, సామాన్య రాయబారులద్వారా సమాధానము కుదురనిచో, ఐక్యరాజ్య సమితిద్వారా సమస్యలను పరిష్కరించుట మేలని అట్లీ చెప్పినాడు. వీనినికాదని ప్రత్యేక సమావేశాలు జరుపుటవలన ప్రత్యేక ప్రయోజనమేమీ ఉండజాలదనికూడా చెప్పినాడు.

## చైనా కమ్యూనిస్టులకు 50 వేలమంది జపాన్ యుద్ధఖైదీల సహాయము

### సమితి రాజకీయసంఘములో చైనాప్రతినిధి ప్రకటన: అస్త్రసన్యాస సమస్యపై చర్చ

పారిస్, నవంబరు 11: మంచూరియాలో కమ్యూనిస్టుల దండయాత్రకు రష్యా తోడ్పడిందనీ, 50 వేల జపనీస్ యుద్ధఖైదీలను కూడా కమ్యూనిస్టులపక్షమున వినియోగించుచున్నారనీ నేడు ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘ సమావేశంలో చైనాప్రభుత్వ ప్రతినిధి డా॥ టింగ్ ఫు సియాంగ్ ప్రకటించినాడు.

చైనాప్రభుత్వం ఇంతగాక మరింతగా సైన్యాలను పెంచి యుద్ధంచేసినా జయించజాలదని రష్యాప్రతినిధి ఆంద్రీ విషిన్స్కీ ఆరోపణలకు చైనాప్రతినిధి సమాధానమిస్తూ పైవిధంగా రష్యాపై ఆరోపణ చేసెను.

అగ్రరాజ్యము లైదూ ఆయుధాల నిలవలను బాగా తగ్గించవలెనని సూచించు రష్యన్ తీర్మానముపై నేడు రాజకీయ సంఘంలో చర్చ జరిగినప్పుడు చైనా ప్రతినిధి తీర్మానమును తీవ్రముగా విమర్శించుచూ, రష్యా వాస్తవముగా ప్రపంచములో శాంతిని కోరుటలేదని చెప్పెను. చైనా ప్రభుత్వం మంచూరియాలో కమ్యూనిస్టులతోనేగాక రష్యా అధీనంలో ఉన్న జపనీస్ బందీలతో కూడా పోరాడవలసి వచ్చినదని డా॥ సియాంగ్ చెప్పెను. ఒక దేశంలో మరొకదేశం గూఢచారి శాఖను ప్రయోగించుచుండగా శాంతి అసంభవమనీ, కొరియా, మంచూరియా, గ్రీస్ దేశాలలో ముందుగా రష్యా పంచమాంగదళాలను (గూఢచారి శాఖలు) తొలగించినగాని ఎట్టి శాంతి ప్రతిపాదనలు అయినా నిరర్థకములేననీ అతడు చెప్పెను. ప్రపంచమంతటా పంచమాంగదళాలను నిరస్త్రులుగా చేయుటకు చైనా ప్రభుత్వం త్వరలో కొన్ని ప్రతిపాదనలు చేయగలదని అతడు ప్రకటించెను.

చైనా ప్రతినిధి ఉపన్యాసమంతయూ కుతంత్రములు, అపవాదులు, అనవసర ఆరోపణలతో నిండియున్నదని రష్యా ప్రతినిధి ఆంద్రీవిషిన్‌స్కీ సమాధాన మిచ్చెను. చైనాలో స్వతంత్రసేనల పోరాటం మూలంగా ఇప్పుడు చైనా ప్రభుత్వం రష్యా తీర్మానమున కంగీకరించజాలకున్నదని అతడు చెప్పెను.

చైనా ప్రభుత్వం ఆయుధాలు తగ్గించినా తగ్గించకపోయినా చైనా ప్రజల స్వాతంత్ర్యపోరాటానికేమీ భంగం వాటిల్లదనీ, ప్రభుత్వం సైన్య బలాలను హెచ్చించినప్పటికీ యుద్ధపరిస్థితి ఒకే తీరుగా ఉండిత్తీరుననీ విషిన్స్కీ చెప్పినాడు.

## స్టిక్కర్-హట్టా సంప్రతింపుల ఫలితంగా ఇండొనీసియా ప్రతిష్టంభన పరిష్కారం కాగల అవకాశం

బటేవియా, నవంబర్ 11: ప్రస్తుతం ఏర్పడిన ప్రతిష్టంభనను తొలగించి, తిరిగీ సంప్రదింపులను ప్రారంభించటానికి ఇండొనీషియా ప్రధాని డా॥ హట్టా, డచ్చి 'శాంతిసంఘ' నాయకుడు డా॥ స్టికర్‌లు అంగీకరించిరని జోగకర్తా రేడియో నేడు ప్రకటించినది. రిపబ్లిక్ ప్రభుత్వ ప్రచార శాఖామంత్రి మహమ్మద్ నజీర్ ఈ వార్తను ప్రకటిస్తూ, ఈ సంప్రదింపులు మధ్యవర్తి సంఘంలోని అమెరికన్ ప్రతినిధి చేసిన సూచనల ననుసరించి జరుగునని ప్రకటించెను. సంప్రదింపులు త్వరలోనే ముగియగలవనీ, వాటి ఫలితాలను ఇప్పుడే చెప్పలేమనీ అతడు చెప్పినట్లుగా జోగ్జకర్తా రేడియో ప్రకటించెను.

డచ్చి ప్రతినిధి డా॥ స్టికరు నేడు హాలండ్‌కు బయలుదేరెను. బయలుదేరుటకుముందు ప్రతిష్టంభనలో బిగువు తొలగిపోయినదని అతడు చెప్పెను. సంప్రదింపులలో సూచించబడిన అంశములను ఖాయపరుస్తూ డా॥ హట్టా వ్రాసిన ఉత్తరాన్ని ఇతడు వచ్చి ప్రభుత్వమువద్దకు తీసుకొని పోయెనని అభిజ్ఞవర్గాలవలన తెలుస్తున్నది.

### తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వస్థాపన

హట్టా-స్టికర్‌ల సంప్రదింపులకు ఫలితంగా ఇండొనీషియా భవిష్యత్తుపై ఏర్పడిన ప్రతిష్టంభన తొలగిపోయి, తిరిగీ సంప్రదింపులు ప్రారంభమవటానికి వీలు కలిగినదని విశ్వసనీయ వర్గాలు భావిస్తున్నారు. వెనుకటి పథకాలన్నిటినీ రద్దుచేసి తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వాన్నొకదానిని మంత్రివర్గంతో ఏర్పరచుట జరగవచ్చునని వీరు భావిస్తున్నారు.

శబ్దంకంటే ఎక్కువ వేగంతో పోగల జెట్ ప్రొపెల్లు డహోలీలెండు వాంపైర్ విమానములు మూడు ఇటీవల ఢిల్లీ చేరినవి. రాయల్ ఇండియన్ విమానదళ విస్తరణకై భారత ప్రభుత్వము వీటిని తెప్పించినది. ఈ మూడింటిలో ఒకదాన్ని చిత్రంలో చూడవగును.

## టోజో, హిరోటా, డొయిహారా ప్రభృతులకు మరణ దండన

### జపాన్ యుద్ధనేరస్థులకు అంతర్జాతీయ విచారణ సంఘ శిక్షలు

టోక్యో, నవంబరు 12: పదకొండు రాజ్యముల ప్రతినిధులతో గూడిన అంతర్జాతీయ యుద్ధ నేర విచారణ సమితివారు టోజో ప్రభృతి జపాను యుద్ధనేరస్థులను 25 గురను విచారించి నేడు తీర్పులు చెప్పి అందరకు శిక్షలు ఈ క్రింది విధముగా విధించిరి:

హిదేకీ టోజో, మాజీ జపాను యుద్ధ ప్రధాని, వయస్సు 64 ఉరిశిక్ష. కోకీహిరోటా, హిటారోకి మారూ, ఇవాని మట్సుయి, అకిరా ముటోలకు మరణదండన విధించబడెను. హషీమోటో, హోషీనో, ఇటాగాకీ మొదలైన అనేకమందికి యావజ్జీవ కారాకారశిక్ష విధించబడెను. మిగిలినవారికి పరిమిత కారాగారశిక్షలు విధించబడినవి.

జపాన్ మాజీప్రధాని టోజో

### జపాన్ యుద్ధ పరిశ్రమ

వాషింగ్‌టన్, నవంబరు 11: జపాన్ యుద్ధ పరిశ్రమలు తిరిగి తలెత్తకుండా చేయుటకుగాను రష్యా సూచించిన క్రొత్త పద్ధతిని యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వం నిరాకరించింది. శాంతి సంధి అమలుజరిగిన తరువాతకూడా జపాన్ యుద్ధపరిశ్రమలను నిర్బంధించవలెనని రష్యా ప్రతిపాదనలో సూచింపబడినందున, ఇట్టి సూచనను ఆలోచించుటకుకూడా దూర ప్రాచ్య సంఘమునకు హక్కులేదని అమెరికా ప్రతినిధి తెలిపెను.

## మానవ సామరస్యానికి కృషి

### శ్రీ రాజగోపాలాచారి ఉద్బోధ

న్యూఢిల్లీ, నవంబరు 11: మానవులమధ్య సామరస్యం సాధించి వివిధ సమస్యలను పరిష్కరించి భారతదేశాన్ని ప్రపంచానికంతకూ ఆదర్శప్రాయమైనదిగా చేయవలెనని గవర్నర్ జనరల్ శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేడు రోటరీ క్లబ్బు సభ్యులకు హితబోధచేసిరి.

సమస్యలన్నీ దాదాపు భ్రమప్రాయములేననీ, శుద్ధసత్యమే ప్రధానముగా సర్వమునూ వీక్షించుట అలవర్చుకొన్నచో, ఆ సమస్యలు వాని యంతట అవే పరిష్కారం కాగలవనీ శ్రీ రాజగోపాలాచారి గారు చెప్పిరి. హిందూ మహాసముద్రంలో ప్రధాన స్థానంలో ఉన్నందువల్లనూ, అపారమైన జనసంఖ్య ఉన్నందువల్లనే గాక, సర్వసమస్యలనూ పరిష్కరించుటలో భారతదేశం ఆదర్శప్రాయం కాగలదను ఆశాభావంతో కూడా ప్రపంచమంతా నిరీక్షించుచున్నదని చెప్పిరి. వైషమ్యాలను లక్ష్యపెట్టకుండా పరస్పరం గ్రహించుటకు యత్నించినప్పుడే సామరస్యం కుదురగలదు. ఈపద్ధతిని దేశంలోని సమస్యలన్నిటినీ పరిష్కరించుట మనవిధియని వారు చెప్పిరి.

## రాష్ట్రీయ స్వ. సేవక సంఘం మీద ఆంక్షఎత్తివేయబడదు

న్యూఢిల్లీ, నవంబరు 11: రాష్ట్రీయ స్వయంసేవక సంఘం మీద భారతప్రభుత్వం నిషేధాజ్ఞను ఎత్తివేయ దలచుటలేదని విశ్వసనీయంగా తెలియవచ్చినది.

రాష్ట్రీయ స్వయంసేవకసంఘ చాలకుడు కొన్నివారాలుగా ఢిల్లీలో మకాము చేసియున్నాడు; ఆయన హోంశాఖామంత్రియైన సర్దార్ వల్లభభాయ్ పటేల్ను రెండుమార్లు కలుసుకొని, స్వయంసేవక సంఘం హిందువుల సాంస్కృతిక సాంఘిక జీవితాన్ని అభివృద్ధిచేయడానికేపాటుపడుతూ వచ్చినదనీ, అందుచేత సంఘం మీద నిషేధాజ్ఞను విధించడం న్యాయం కాదని విన్నవించుకున్నారనీ తెలియుచున్నది. భారతప్రభుత్వం ఇటీవలనే రాష్ట్రీయ స్వయంసేవకసంఘం మీద ఆంక్షను ఎత్తివేయవలెనా లేదా' అన్న విషయాన్ని సమీక్షచేసింది. స్వయంసేవక సంఘంమీద ఆంక్షను ఎత్తివేయకూడదని రాష్ట్రప్రభుత్వములు ఇండియా ప్రభుత్వమునకు తెలియజేసినవి. కేంద్ర ప్రభుత్వంకూడా రాష్ట్ర ప్రభుత్వాల అభిప్రాయంతోనే ఏకీభవించుచున్నది. ఈ విషయమై త్వరలోనే ఒక అధికార ప్రకటన వెలువడగలదని తెలియుచున్నది.

## అచ్యుత పట్వర్ధన్ అరెస్టు

నాసిక్, నవంబరు 11: సోషలిస్టు నాయకుడు అచ్యుత పట్వర్ధన్‌గారు వసంత ఉపాధ్యాయ, సదాశివభాగవత్కర్ అను ఇద్దరు సోషలిస్టులు సిన్నార్ అనుచోట (నాసిక్‌కు 17 మైళ్లు) నేడు అరెస్టు చేయబడినారు. శ్రీ అచ్యుత పట్వర్ధన్ సిన్నారులో ఒక బహిరంగసభలో ఉపన్యసించుచుండగా, సభలో కొందరు అల్లరి ప్రారంభించినారు. సభ జరుపరాదని నాసిక్ జిల్లామేజిస్ట్రేటు 144వ సెక్షన్ క్రింద ఉత్తరువు చేసినను, పాటించకుండా సభ జరిపినందువల్ల వీరిని అరెస్టు చేసిరి. నాసిక్ సెంట్రల్ జైలులో ఇప్పుడు నిర్బంధించబడినారు.

## ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థకు ఇండియాలో అనుసంధాన సంఘం

న్యూఢిల్లీ, నవంబరు 11: ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థకూ, ఇండియాకు మధ్య అనుసంధాతగా వ్యవహరించ గలందులకై భారత ప్రభుత్వం దేశంలో ఒక అనుసంధాన సంఘమును నియమించుటకు నిర్ణయించినది. ఆహార వ్యవసాయ సంస్థలో చేరిన ప్రతి దేశమూ ఇటువంటి అనుసంధాన సంఘములను స్థాపించవలెనని ఆ సంస్థ నిబంధనలలో ఉన్నది.

ఇండియాలోని ఆహార వ్యవసాయ పరిస్థితిని గురించిన వివరములను ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థకు ప్రపంచ సంస్థద్వారా తెలియవచ్చే సమాచారమును కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములకు అందజేస్తూ ఉండడం యీ కమిటీ కర్తవ్యం అయి ఉన్నది.

భారత ప్రభుత్వ వ్యవసాయ శాఖా కార్యదర్శి ఈ సంఘమునకు అధ్యక్షుడుగా వ్యవహరించును. ఈ క్రింద పేరొన్న వృత్తిలో ఆయా సంస్థల ప్రతినిధులు సంఘములో సభ్యులుగా నియమింపబడుదురు: అధికారులుకాని కేంద్రశాసనసభా సభ్యులు 5 గురు; అ. భా. వాణిజ్య పారిశ్రామిక మండలి ప్రతినిధులు ఇద్దరు; గ్రామీణ ప్రజల ప్రతినిధులు 3 గ్గురు (వీరిని వ్యవసాయశాఖామంత్రియే నామినేట్ చేయును); ప్రతి శాఖకు ఒక్కొక్క ప్రతినిధి చొప్పున భారత ప్రభుత్వ ఆహార వ్యవసాయ, ఆరోగ్య, వాణిజ్య, విదేశాంగ, కామన్వెల్తు శాఖల ప్రతినిధులు; భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘానికి ఉపాధ్యక్షుడు; సంఘంలో సభ్యులుగా ఉందురు. అధికారేతరులైన సభ్యులయొక్క సభ్యత్వ కాలపరిమితి 3 ఏళ్ళు; కావలెననుకుంటే పాతవారినే మళ్ళీ మళ్ళీ నామినేట్ చేసుకుంటూ ఉండవచ్చును.

### అధికాహారపుదిగుమతులకు భారత రాయబార్ల యత్నం

లండన్, నవంబరు 11: ప్రపంచ ఆహార వ్యవసాయిక సమావేశానికి భారత ప్రభుత్వ రాయబారులైన శ్రీ దినకరరావుదేశాయి (బొంబాయిమంత్రి) శ్రీ అనుగ్రహ నారాయణసింహ, శ్రీ పి. ఆర్. దేశ్‌ముఖ్ గార్లు, వారి సలహాదార్లు సర్ దాతార్‌సింగ్, డబ్లియు. ఏ. నాటుగార్లు నేడు మధ్యాహ్నం ఇక్కడికి వచ్చినారు. వీరు ఇచ్చటనుంచి అమెరికా వెళ్లగలరు.

శ్రీ దినకరరావు దేశాయ్‌గారు రాయిటర్ విలేఖరితో ప్రసంగించుచూ భారతదేశానికి ఆహారపదార్థాల దిగుమతి కోటాను హెచ్చించవలెనని కోరగలరని చెప్పిరి. ఈ సంవత్సరం భారతదేశంలో ఆహార పరిస్థితి మరీ పాడుగాలేదు. కాని అక్కడక్కడ కొన్నిచోట్ల పంటలకు నష్టం సంభవించిందని చెప్పిరి. భారతదేశంలో ప్రతిసంవత్సరం 50 లక్షల టన్నుల ఆహారం కొరతగా ఉంటుంది. ఇంత లేమి నింపు లేనప్పుడు కోటి టన్నుల ఆహారపదార్థాలు అవసరమౌతవి.

## ఆశియా ఖండంలో వాతావరణ పరిశోధన కేంద్రాల అభివృద్ధి

### విచారణసంఘ నియామకానికి ప్రాంతీయసభ నిర్ణయం

న్యూఢిల్లీ నవంబరు 10:

ఆశియాఖండ దేశములలో ఇప్పుడున్న వాతావరణపరిశోధనా కేంద్రములను అభివృద్ధిచేయుటకు గల అవకాశములను పరిశీలించుటకై, 7 గురు సభ్యులతో కూడిన ఒక ఉపసంఘమును, అంతర్జాతీయ వాతావరణ సంస్థ ఆశియా ప్రాంతీయ కమీషన్ నియమించెను.

ఈ ఉపసంఘమునకు డా॥ యస్. కె. ప్రామాణిక్ (భారత ప్రతినిధి) అధ్యక్షుడుగా నుండును. ఇండోనీషియా ప్రతినిధి క్యాగర్‌డస్ ఇరాన్ ప్రతినిధి మదాంఅరస్టీ పాకిస్థాన్ ప్రతినిధి అబ్దుల్ వాహీద్‌ఖాన్, సయాం ప్రతినిధి కస్టై చారూన్ బున్నాగ్ జపాన్ ప్రతినిధి యం. పి. వండాల్, సోవియట్ ప్రతినిధి, యీ ఉపసంఘములో సభ్యులుగనుందురు. అదనంగా మరి కొంతమందిని సభ్యులుగా చేర్చుకొనుటకు యీ ఉపసంఘమునకు అధికారమున్నది. ఆశియాఖండము దేశములలో ఉన్న వాతావరణపరిశోధక కేంద్రములను, ముఖ్యముగా, అంతర్జాతీయ విమానాశ్రయములను పరిశీలించి, వాటికి వాతావరణ పరిశోధన నిమిత్తం యేయే సౌకర్యములను అదనముగా కల్పించవలెనో, ఏరకపు పరిశోధనాగారములు అవసరమో సూచించును.

ఆశియాఖండదేశములకు, నైరుతి పసిఫిక్ ప్రాంతములకు మధ్య సాన్నిహిత్యమును నెలకొల్పు నిమిత్తము మరియొక ఉపసంఘముగూడ నియమింపబడెను. ఈ ఉపసంఘమునకు భారత ప్రతినిధి ఎ. కె. రాయ్ అధ్యక్షుడుగా నుండును.

అంతర్జాతీయ వాతావరణ సంస్థ ఆశియా కమీషన్ నిన్న స్టేట్స్ కౌన్సిల్ భవనంలో సమావేశమై డా॥ యస్. కె. బెనర్జీ (భారత ప్రతినిధి)ని అధ్యక్షునిగా ఎన్నుకొనెను.

## భారత జాతీయ గీతం

### రవిశంకర్ శుక్లా సూచన

న్యూఢిల్లీ, నవంబరు 11: రాజ్యాంగ పరిషత్ సభ్యులు, సి. పి. ప్రధాని అయిన పండిట్ రవిశంకర శుక్లాగారు భారత జాతీయగీతము ఈ విధముగ నుండవచ్చునని సూచించుచున్నారు:

జనగణ మన అధి వాసిని జయహే
మహిమణి భారత మాతా
హైమ కిరీటిని వింధ్య మేఖలే
ఉదధి ధౌత పద కమలే
గంగా, యమున, రేవా, కృష్ణ, గోదావరి
జల విమలే
వివిధతదాపి అవిభక్తే
శాంత శక్తి సంయుక్తే
యుగయుగ అభినవ మాతా
జనగణ క్లేశ వినాశిని జయహే
మహిమణి భారత మాత.
జయహే, జయహే, జయహే—
జయ- జయ- జయ- జయహే

తాను కోరినందున పండిత డి. పి. మిశ్రాగారు ఈ గీతమును రవీంద్రుని గీతముపై ఆధారపడి వ్రాసియిచ్చినారనికూడా శుక్లాగారు తెలుపుచున్నారు.

## పాకిస్తానుకు రాకపోకల నిబంధనలు

న్యూఢిల్లీ, నవంబర్ 10: తాత్కాలికముగా పాకిస్తానుకు వెళ్లి తిరిగివచ్చు భారత పౌరులకు పర్మిట్లు దొరకుటలో ఇబ్బంది కలుగుచున్నది. అందుచేత పాకిస్తాను వెళ్లువారు తాము భారత పౌరులమనియు, తాత్కాలికముగా పాకిస్తాను పోవుచున్నామనియు జిల్లా కలెక్టరు వద్దగాని డిప్యూటీ కమీషనరు వద్దగాని ముందుగా సర్టిఫికేట్లు పుచ్చుకున్నచో తిరుగు ప్రయాణము సుకరమగును. పాకిస్తానులో ఉండి పోయిన బంధువులను ఇండియాకు తీసుకొనిరాగోరువారు అట్టివారి పేర సర్టిఫికేట్లు పుచ్చుకొనుచు వారివయసు, పేర్లు, గుర్తులు, తమకును వారికిని గల బంధుత్వము నమోదు చేయుచు, వారు భారత పౌరులే అనియు, కాందిశీకులుగా వెళ్లినవారు కారనియు, వారు తిరిగివచ్చుటకు ఆక్షేపణలు లేవనియు ఉదహరించవలెను. తిరిగి వచ్చుచున్నవారు సర్టిఫికేటు పుచ్చుకొనువారి భార్యయో, భర్తయో, పిల్లలో అయి ఉండవలెను. ఈ సర్టిఫికేట్లను జిల్లా కలెక్టరు వద్దగాని డిప్యూటీ కమీషనరు వద్దగాని మాత్రమే పుచ్చుకొనవలెను. తాత్కాలికముగా పాకిస్తాను పోవుచున్నవారు తాము పుచ్చుకొను సర్టిఫికేట్లకు తమ ఫోటోలు స్వంత ఖర్చుతో అంటించవలెను.

### పీ డ్యోట్లు

సెంట్రలుస్టేషను సర్కిలు పోలీసు ఇన్స్పెక్టరు ఎస్. ఎస్. దేవసనంగారు బెజవాడ స్టేషనుకి బదిలీ అయి, అక్కడున్న విల్సనుగారు సెంట్రలుకి మార్చబడిరి. సెంట్రలుస్టేషను ఉద్యోగులు దేవసనంగారికి వీడ్కోలు విందొసంగిరి.

## పశువులకు వ్యాధులు

### రాష్ట్రమందన్ని పశువులకు టీకాలు

చెన్నపట్నం, నవంబరు 11: చెన్నరాష్ట్రమందంతటా పశువుల వ్యాధులను నివారించుటకు గాను పశువులన్నిటికిని టీకాలు వేయుసన్నాహములు జరుగుచున్న వనియు, ఇందునిమిత్తం ఆంధ్ర తమిళ కర్నాటక, మళయాళ ప్రాంతములందు నాల్గు మొబైల్ వెటర్నరీ హాస్పెటలున్ను ఏర్పాటు చేయబడెనని వ్యవసాయమంత్రి మాధవమీనన్ గారు చెప్పిరి.

రాష్ట్రమందంతటా ఎద్దులకు వట్టలు నిర్బంధంగా కొట్టించుటకు ఒకబిల్లు ఉన్నదనియు, దానిని ప్రభుత్వము అమలు చేసెదరనియు మంత్రిగారు చెప్పిరి.

### విశాఖలో పశువులకు టీకాలు

పశువ్యాధి నివారణకు గాను ముందు విశాఖ జిల్లాలో పశువులకు టీకాలు వేయ ప్రారంభింతురని ప్రభుత్వ ప్రకటన తెలుపుచున్నది.

## సస్యాభివృద్ధి కార్యక్రమం

1948-49 సం॥ నకు 38 లక్షల 75 వేలు విలువగల 11 సస్యాభివృద్ధి ప్రణాళికలు ప్రభుత్వమువారు తయారుచేసిరి. వీటిక్రింద 20810 ఎకరాలు ఆయకట్టులోనికివచ్చును. 6412 ఎకరాలకు నీటివసతి బాగుపడును. భారత ప్రభుత్వమువారు వీటికి ఆమోదించిరి. మైనరు ఇర్రిగేషను ప్రాజెక్టుల క్రింద, 20 లక్షల విలువగల ప్రణాళికలతో పంచవర్ష ప్రణాళికను మద్రాసు ప్రభుత్వము వారు తయారుచేసిరి. వీటికి వెంటనే ఫలితములు రాగలవనికూడా చెప్పుచున్నారు. 5 కోట్ల విలువగల 298 స్కీముల క్రింద 250 ఎకరాలు సాగుకానున్నది. 48-49 సం. నకు 124 స్కీములు 2 కోట్ల 78 లక్షల విలువగలవి 111285 ఎకరాలు సాగులోనికి వచ్చునని కలవు.

## రామేశ్వరం కాల్వ స్కీము సర్వే

బంగాళా ఖాతమును, అరేబియన్ సముద్రమును కలుపుటకు 5 మైళ్ల కాల్వ త్రవ్విన 330 మైళ్ల దూరము పడవలు చుట్టి రానవసరం లేదని ఇంజనీర్లు ఒక ప్రణాళికను వేసిరి. మన్నార్ జలసంధినుండి పాల్ భూసంధిగుండా రామేశ్వరం దీవి నుంచి కాల్వ ఉండవలెననియు, ఇదివరకే పాంబన్‌వరకు ఒక కాల్వ ఉన్నదనియు, ప్రస్తుతానికి ఈ ప్రణాళిక, సర్వే ఆపు చెయ్యవలసిన దనియు పోర్టు కమిటీవారు సూచించిరి. దీని నిమిత్తం 159 లక్షలు ఖర్చుగునని అంచనా వేయబడెను.

### శేషనింగు

మదరాసు శేషనింగు విచారణ ఉత్తరము, ప్రారంభచర్యలు చంగల్పట్టు కాంచీపురం మునిసిపాలిటీలందు నవంబరు 16 తే. నుండి వర్తించునని ప్రభుత్వంవారు ప్రకటించిరి.

## కోర్టులుపట్టిన లిటిగెంట్ల నిషేధబిల్లు

కోర్టులుపట్టిన లిటిగెంట్లు దావాలు వెయ్యకుండా మద్రాసు ప్రభుత్వంకు జారీ చేసినబిల్లును లాశాఖామంత్రి మాధవమీనన్ గారు గురువారం పత్రికా ప్రతినిధులకు వివరిస్తూ జిల్లాకోర్టులందు, హైకోర్టునందు ఇటువంటివారు కొందరు ఉన్నారనియు, హైకోర్టువారు కోరినందుననే ఇట్టి బిల్లును తెచ్చుచున్నామనిరి. ఫలానివాడు కోర్టు మరిగినవాడు అని అడ్వొకేట్ జనరల్ హైకోర్టులో ప్రతిపాదించును. జిల్లాకోర్టులోగాని హైకోర్టులోగాని ఫలానివాడు దావా చెయ్యరాదు అని నిషేధించిన అతడు దావాలు చేయుటకు వీలుపడదు. అనర్థిలమణీ వ్యక్తులు కొందరిని కోర్టులచరియేనా రాకుండా చేయుటకే ఈ బిల్లు ఉద్దేశ్యమని మంత్రిగారు తెలిపిరి.

## 10 బిందువుల మద్యము నుంచుకొన్నందుకు ఖైదు

### హైకోర్టులో శిక్ష రద్దు

చెన్నపట్నం, నవంబరు 11: కోయంబత్తూరుజిల్లా పల్లడం తాలూకా వాసి కుచన్న నాయకన్ అను నతడు తనవద్ద 3-7-47 వ తేదీన 10 బిందువుల కలిగిన నొకబ్రాంది సీసా లైసెన్సు లేకుండా నుంచుకొని యుండెనను నేరమునకై పోలీసులు ఛార్జి పెట్టగా పల్లడం స్టేషనరి సబ్ మేజిస్ట్రేటు వానికి 6 వారాలకఠినశిక్ష విధించెను. శిక్షితుడు అపీలుచేయగా కోయంబత్తూరునగర మేజిస్ట్రేటు పైశిక్షను ఖాయపరచెను. శిక్షితుడు హైకోర్టులో రివిజను దాఖలుచేయగా న్యా॥ పి. గోవిందమీనన్‌గారు పిటిషను విచారించి ఒక సీసాలో 10 బిందువుల మద్యము నుంచుకొని యుండుట అంత దోషముగా నెంచుట తగదనియు, తప్పత్రాగి సంఘములో అయుక్తముగా ఎవరూ నడువకుండా చేయుటకే మద్యనిషేధచట్టపు ముఖ్యోద్దేశ్యము గనుక యిట్టి అల్పనేరమునకు శిక్ష అనవసరమని అభిప్రాయము వెలిబి శిక్షను రద్దుచేసిరి.

### ఎలెక్ట్రిసిటీ చార్జీలు పెంచుట

మదరాసు ఎలక్ట్రిసిటీ సప్లయి సర్చార్జి ఆర్డరు ప్రభుత్వంవారు యీవారం గజిటులో ప్రకటించిరి. యుద్ధసమయపు ఖర్చులకు గాను ప్రతిబిల్లులోను నేటికి 10% ఎక్కువగా చార్జి పుచ్చుకొందురు. ఈ ఉత్తరువు ప్రకటింపబడిన తరువాత రెండోసారి మీటరు చూచినప్పటినుండి, యీ అదనపు చార్జి చేయబడును.

### ఫాక్టరీలు

నానుపరు ఫాక్టరీసు ఆక్టు (1947) రాష్ట్రంలో అన్నిప్రాంతాలకు 1-1-49 తేదీనుండి అమలు జరుగునని ప్రభుత్వం వారు ప్రకటించిరి.

### బస్సు కండక్టరుల ట్రయినింగు

మదరాసు ప్రభుత్వం ట్రాన్సుపోర్టు మను శాఖవారు, బాడిగార్డు లైన్సునందు బస్సు కండక్టరుల శిక్షణ కేంద్రమును స్థాపించిరి. 11 తేదీ నుండి, క్రొత్తగ నియమింపబడిన స్త్రీ కండక్టరులకు ఒక వారం శిక్షణమొసంగెదరు. వీరిన్ని ఒకే మార్గంలో బస్సులపై నియమింతురు. కనుక ఒక్కవారమే శిక్షణ. పురుషులకు 3 వారాలు శిక్షణయుండును. డ్రైవరులకు, ఇనస్పెక్టరులకుగూడ శిక్షణ కేంద్రములు స్థాపించెదరని తెలియుచున్నది.

### ఆంధ్ర సెనేటు

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు కోయంబత్తూరు యునైటెడు మోటార్సు కంపెనీ వారు విరాళమిచ్చిన అధికారం ప్రకారం ఆ కంపెనీ డైరెక్టరయిన ఎ. షణ్ముగం గారు, ఆంధ్ర సెనేటుసభ్యులుగ నియమింపబడిరి.

మదరాసు విశ్వవిద్యాలయం సెనేటు సభ నవంబరు 26 తే 11 గం. జరుగును.

### ప్రజారక్షణ చట్టం క్రింద కేసులు

ప్రజారక్షణచట్టంక్రింద కేసుల పరిశీలన చేసి ప్రభుత్వమునకు సలహాయిచ్చు సంఘమునకు శ్రీ శ్రీ విజయనగరం గోవిందరాజాచారి గారిస్థానే న్యా॥ కె. సుబ్బారావుగారిని సలహాసంఘ చైర్మన్‌గా మద్రాసు ప్రభుత్వమువారు నియమించిరి.

### అన్నామలై విద్యార్థులసమ్మె

అన్నామలై విశ్వవిద్యాలయ ఇంజనీరింగు టెక్నలాజికల్ విద్యార్థులు 500 మంది తమ డిగ్రీలకు తగిన రికగ్నిషన్ లేకున్నదని సమ్మెచేసిరి. వారి ప్రతినిధులు కృష్ణరావు ఎ. వి. శర్మ, దేవరాజుపిళ్లెగారలు విద్యామంత్రివద్దకువచ్చి తమకోర్కెలను తెలిపిరి.

### నగరములో సమ్మెదారుల అరెస్టులు

చెన్నపట్నం, నవంబరు 11: నిన్న జార్జి టోన్ ఆడిసన్, అసోసియేటెడ్ ప్రింటర్స్ కంపెనీలలోని దాదాపు 850 మంది పనివారు (పనిమాని కూర్చుని)సమ్మె చేసిరి. వీరి కోర్కెలలో ముఖ్యమైనవి: ఓటర్లుగా చేరుటకు ఇచ్చిన శెలవు దినములు రెండింటికికూడా జీతము నివ్వవలెను. మూడునెలల బోనసు, హెచ్చు కరువు భత్యము, ఇంటి అద్దెభత్యము, వారమునకు 44 గంటలపని, మొదలైనవి. యజమానులు నేడు వారి నిపనిలోనికి రానివ్వ లేదు. అందుచేత పనివారు లేబర్ కమీషనర్‌ను చూడ బోయిరి. కమీషనర్ ఇది అక్రమసమ్మెఅని, వీరికి దర్శనమివ్వనిరాకరించెను. ఆ తరువాత పనివారు చీపక్ నుంచి ఊరేగింపుగా బయలుదేరిరి. ఊరేగింపులో మొత్తము 54 మందిని పోలీసులు అరెస్టు చేసిరి.

### సినిమాలకు నిబంధనలు

సినిమాలు తీసేవారికి చూపించేవారికి కొన్ని నిబంధనలు తయారుచేసి సెన్సార్ బోర్డువారి సహాయార్థము మద్రాసు ప్రభుత్వమువారు జారీచేసిరి. ఫిల్ముల ఉత్తమ ప్రమాణమునకే నిబంధనలుతయారుచేసిరట.

### భాషారాష్ట్ర విచారణసంఘం

భాషావిచారణసంఘమువారి ఆఖరు కార్యకలాపములకు హాజరగుటకు మదరాసు సహ సభ్యులు రామకృష్ణంరాజు, టేకూరు సుబ్రహ్మణ్యం, రామలింగం చెట్టియారు, నారాయణమీనన్ గారలు డిల్లీకి ఆహ్వానించబడిరి.

### ఆంధ్రహెరల్డ్‌పైని షేధంతొలగింపు

"ఆంధ్ర హెరాల్డ్" అను ఆంగ్ల వారపత్రికపై మద్రాసు ప్రభుత్వంవారు నిషేధము తొలగించిరి.

### డా॥ పట్టాభికి అభినందనములు

జాగ్రటవును పౌరుల వక్కోసు తీసువారు డా॥ అలఘ్రసింగరు నాయుడుగారి అధ్యక్షతను సమావేశమయి, కాంగ్రెసు అధ్యక్షునిగ ఎన్నుకొనబడిన డా॥ పట్టాభిగారిని అభినందించుచు తీర్మానించిరి.

### శ్రీ కళా వెంకట్రావు

రెవెన్యూ మంత్రి కళా వెంకట్రావు గారు 13 వ తేదీ రాత్రి బయలుదేరి పుదుక్కోటవెళ్ళి 15 ఉదయానికి మద్రాసు చేరెదరు.

### కూర్మయ్యగారి సంచారం

గౌ॥ వే. కూర్మయ్యగారు 13 తేదీ రాత్రి మదరాసు విడచి, 14 బెజవాడ, గుండాల, తేల్ప్రోలు, కొండపల్లి చూచుకొని రాత్రికి బెజవాడ చేరిరి. 16 ఉదయానికి మదరాసు వస్తురు.

## మలయాలో కమ్యూనిస్టు తిరుగుబాటు విఫలమైనట్లే

### బ్రిటిష్ వలసశాఖాకార్యదర్శి ప్రకటన

లండన్, నవంబరు 10: "మలయాలో ప్రభుత్వమును కూలద్రోయుటకు కమ్యూనిస్టు దౌర్జన్య ముఠాలు సాగించిన తిరుగుబాటు పూర్తిగా భగ్నమైనదనే చెప్పవచ్చు. ప్రజలను తగినంతగా తమ వైపుకు త్రిప్పుకోలేక పోయినారు" అని బ్రిటిష్ వలస శాఖా కార్యదర్శి లార్డు లిస్టోవెల్, లార్డ్సుసభలో మలయా పరిస్థితిపై జరిగిన చర్చ సందర్భములో ప్రకటించెను. "మలయా మొత్తంజనాభా 60 లక్షలు. దీనిలో 3 నుంచి 5 వేల వరకు మాత్రమే సాయుధ కమ్యూనిస్టు ముఠాలు. ఈముఠాలలో కడపటి ముఠా నాశనమయ్యేవరకూ సైనిక చర్య కొనసాగుతుంది" అని లిస్టోవెల్ తెలిపెను.

మలయా రాజకీయాలనుగురించి మాట్లాడుచూ, సింగపూరు మలయా ఫెడరేషన్‌లో, యధేచ్ఛగా చేరవచ్చునని, ఉభయ పక్షములు పరస్పరం ఒడంబడిక కుదుర్చుకొనే యెడల బ్రిటన్ కేమాత్రమూ అభ్యంతరంలేదని, లార్డ్ లిస్టోవెల్ తెలిపెను.

ప్రతిపక్షంవారు, మలయాలో బ్రిటిష్ ప్రభుత్వ విధానమును విమర్శించిరి. ప్రభుత్వం కమ్యూనిస్టులపై 1945 లోనే చర్య తీసుకొని ఉండవలసినదని లైకౌంట్ స్వింటన్ అనెను.

## బుడమేరు ముంపు పంటలకు నష్టం

గుడివాడ, నవంబరు 8: గత రెండు దినములు ఇచ్చట వర్షం ఏకధారగా కురిసినది. బుడమేరు ముంపువల్ల ఈ తాలూకా మోపర్రు, చేదుర్తిపాడు, పెదలింగాల, పుట్టగుంట, బొన్నపాడు, నందివాడవగైరా గ్రామముల పంటచేలు నీటిలో మునిగిపోయినవి. ఇచ్చటినుండి ఏలూరు పోవు రోడ్డుమీద రెండడుగుల పైగా నీరు ప్రవహించుచున్నది. బస్సుల రాకపోకలు నిలిచిపోయినవి.

మొన్నను విజయవాడనుండి ఏలూరు రోడ్డుమీద ప్రయాణించుచున్న 8 రెండెడ్లబండ్లు రామిలేరుదాటుచుండగా రెండు బండ్లు వరదలో కొట్టుకొని పోయెను. వాటిలో ఒకబండి, ఆ బండి మనిషి, 8 ఎడ్లు దైవవశాత్తు ఒడ్డుపట్టెను. మిగిలిన బండికి కట్టిన ఎద్లు, కాడితాడు బిగిసినందున చచ్చిపోయెను. బండిమనిషి బండితోసహా వరదలో కొట్టుకొనిపోతూ, కేసరిపల్లి వంతెనవద్ద, వంతెనకున్న ఇనుప కటకటాలు పట్టుకొని పైకి రాగలిగెను. బండి కొట్టుకుపోయెను. గ్రామస్థులు చందాలువేసి ఇతనికి సహాయము చేసినట్లు తెలిసినది.

### నిడుబ్రోలు ప్రాంతంలో నష్టం

నిడుబ్రోలు, నవంబరు 9: ఈ ప్రాంతములలో వారంరోజులనుండి వర్షాలు కురియుచున్నవి. నిన్నటిరోజంతయు అధిక వర్షము కురిసినది. వరిపైరు చాలా దెబ్బతిన్నదని రైతులు ఆందోళన చెందుచున్నారు. వర్షములకు కంకులపైనున్న 'నుంకు' రాలిపోయినది. పైరు గాలికి పడిపోయినది. దీనికితోడు, వరినాట్లు అయి నదిమొదలు ఎలుకలు పొలములలోని మొక్కలను కొరికివేయుటవల్ల కొంత నష్టము కలిగినది. యీ కారణములవల్ల మొదటి అంచనాకన్న కొంత పంటతగ్గునని భావింపబడుచున్నది.

## చంద్రమౌళిగారిచే గాంధీ చిత్రపటావిష్కరణ

పుదుక్కోట, నవంబరు 10: సహకార స్థానిక పరిపాలనా మంత్రి, కె. చంద్రమౌళి ఇటీవల ఇక్కడికి వచ్చిన సందర్భములో పుదుక్కోట పురపాలక సంఘము వారొసగిన సన్మానము చేయుచు, దర్బారు పరిపాలన క్రింద విద్యా, వైద్య ములకు గాను తమకు ఎనిమిది వేలు ముట్టుచుండిన వనియు, వినోదపు పన్నుతో యీ పురపాలక సంఘమునకే ముట్టెడదనియు, మద్రాసుతో సరిసమానముగా కరువు బత్తెము లివ్వవలెనన్న ఒక అరలక్ష అదనపు ఖర్చుండుననియు, మద్రాసు జిల్లా మునిసిపలు చట్టము అమలు జరుగుట వలన కలుగు అదనపు ఖర్చులో తగినంత భారము సంస్థానముల రిజర్వు నుంచి ఇప్పించవలెననియు చెప్పిరి. చంద్రమౌళిగారు దర్బారు వారి వితరణను కొనియాడి, కౌన్సిలుహాలులో మహాత్మాగాంధి చిత్రపటమును ఆవిష్కరించెను.

# ...తి ఆఫ్రికాను సమితి ధర్మ ...త్వం కింద ఉంచవలెను

## ...కర్తృత్వ సంఘంలో శ్రీమతి ...లక్ష్మి చేయనున్న ప్రతిపాదన

...నంబర్ 12: నైఋతి ఆఫ్రి... సమితి ధర్మ కర్తృత్వం ...వలెనని భారత ప్రతినిధ... లక్ష్మి పండిట్ నేడు ధర్మ... సంఘంలో ప్రతిపాదించ... ప్రతిపాదన నా ప్రసంగంలో... అంశాలనే ప్రతిపాదించ... మె నిన్న రాత్రి తెలియజేసి... దక్షిణాఫ్రికా తక్షణమే... కా విషయమై సమితికి... ఖరారు నామాను వ్రాసి... ఇండియా ప్రతిపాదించగల... దక్షిణాఫ్రికా కోరినట్లుగా... ఫ్రికాను దక్షిణాఫ్రికాలో... లెనని నైఋతి ఆఫ్రికా... తున్నారో, లేక ధర్మ... కి వారు విముఖులుగా... లుసుకొనుటకై ఒక నిష్ప... సంఘాన్ని కూడా పంప... యా ఈ ప్రతిపాదనలో...

### ...అసభ్యవర్తన

...కా ప్రతినిధి ఎరిక్ లూవ్ ...దీర్ఘ ప్రసంగం (4 వేల ...చేసిన విమర్శలను ...విజయలక్ష్మి ఎంతమా... ట్టలేదు. ఇతర పనులవలన ...లు ఆలస్యంగా సమావేశా... నుక మొదటి ఆరోపణలను ...ది. కాని ఆమె లోపలకు ...ఆమెకు అవ్వా, బువ్వా ...వు. అట్లా రెండింటినీ ...కు మనం ఆమెను ఎక్కువ ...రలేదు. ఇట్లా రెంటినీ ఆడవాళ్ల సహజలక్షణమని ...వారందరికీ తెలుసు."— ...ంగా దక్షిణాఫ్రికా ప్రతి... న్నాడు. అప్పుడు సమావే... కవహించిన ఇరాన్ ప్రతి... అనవసర ప్రసంగాలను కట్టి ...లూవ్ ను మందలించాడు. ...ప్రసంగాలకు సమాధానం ...క్కరలేదు అని ఆమె తరు... క్ విలేఖరితో అన్నది.

### ...ఫ్రికాపై విమర్శలు

...రిగిన చర్చలో, నైఋతి ...తి ధర్మకర్తృత్వం కింద ...రాకరించిన దక్షిణాఫ్రికా ...న్, ఉరుగ్వే, ఫిలిప్పీన్స్, ...ల ప్రతినిధులు తీవ్రంగా...

...ప్రతినిధి సీవ్యార్ గెరోనా ఈ కింది అంశములను స్పష్ట... ఋతి ఆఫ్రికాపై దక్షిణా... నిర్వహిస్తున్న ధర్మకర్తృ... ట నానాజాతిసమితి (జెనీ... నదికనుక ఇప్పుడు ...క్య రాజ్య సమితి ...గురించి తెలియజేసే ...ణాఫ్రికాకు వున్నది. ఈ ...చి సమితి సర్వసభ్యసమా... రెండుసార్లు నిర్ణయించి ఇప్పుడు చర్చ అనవసరం." ...ధర్మకర్తృత్వమంటే ...శాక్రమణమే

...ప్రతినిధి సాల్వడార్ పి. ...ందివిధముగా విమర్శించెను: ...త సన్నిహితంగా సంబం... ప్పకొనుటకు దక్షిణాఫ్రికా ...దన నిజమునకు నైరుతి ...మణమే. అది కలిపివేసు... దక్షిణాఫ్రికా ప్రతినిధి ...గాథములేదు. ధర్మకర్తృత్వం ...దేశాలన్నిటిలోనూ దక్షి... క్కటిమాత్రమే సమితి ఆజ్ఞ... స్తున్న దని గడచిన 3 సం॥ల ...జరిగిన సంఘటనలు ...నవి. నైఋతి ఆఫ్రికాను ...చేసుకొనటం జరగదని దక్షిణ ...నే ఏడు మాట ఇచ్చి కూడా ...గా ప్రయత్నించటం కోచ ...ణాఫ్రికా ప్రతినిధ పాతవాదన ...ంచినాడు. అయితే దక్షిణ ...ఆదేశాలను ఉల్లంఘిస్తున్న ...శాంతి క్లిష్టసమస్య ఏర్పడి ...కర్త రాజ్యం మిగిలినదేశాల ...తప్పనీ, తానే సరైన పద్ధ... న్నాననీ అనుకొనటం ...త్వం కాకుండా ఉన్నది. ...నైఋతి ఆఫ్రికాను కను... గెలవటం కానీ చేయలేదు. ...ఫ్రికాకు ఎట్టి హక్కు లేదు "

### ...కాపనిసవ్యంగా లేదు

...ప్రతినిధి మాటలాడుతూ ఈ ...ను తెలియజేసెను."నైఋతి...

ఆఫ్రికా రాజకీయంగా పరిపూర్ణతను పొంది స్వతంత్రదేశమైనప్పుడు తనకుతానై దక్షిణాఫ్రికాలో చేరవచ్చును కాని ఆ స్థితిని చెందేవరకూ ధర్మకర్తృత్వం కింద ఉంచవలసినదేశాని ఇతర దేశాలతో కలిపి వేసుకునే ప్రయత్నాలు జరగకూడదు."

పాకిస్తాన్ ప్రతినిధి భారతప్రతినిధి వలెనే అతి ఖండితమైన భావంలో దక్షిణాఫ్రికా ప్రతిపాదనను ఖండించెను. లూవ్ ధర్మకర్తృత్వ ఖరారునామాన్ని వ్రాసి ఇచ్చుటకు నిరాకరించెను.

ఈ వేళతో చర్చ ముగియవలెనని అధ్యక్షుడు నిర్ణయించెను.

## భారతప్రతినిధి విమర్శకు యూనియన్ మంత్రి జవాబు

పారిస్, నవంబరు 11: నైఋతి ఆఫ్రికా విషయంలో దక్షిణాఫ్రికా ప్రభుత్వ వైఖరిని విమర్శిస్తూ భారత రాయబారి కర్ణ నాయకురాలు శ్రీమతి విజయలక్ష్మీపండిట్ ధర్మకర్తృత్వ సంఘసమావేశంలో నిన్న చేసిన ఉపన్యాసానికి యూనియన్ ప్రభుత్వప్రతినిధి ఎరిక్ లో సమాధానమిచ్చెను. భారతదేశంలో అంటరాని తనం, కాశ్మీరు హైదరాబాద్ విషయంలో భారత ప్రభుత్వవిధానాలను పేర్కొని యూనియన్ ప్రతినిధి తమ ప్రభుత్వవిధానమును సమర్థించుకొన యత్నించెను.

పాకిస్థాన్ ప్రతినిధి భారతదేశ వాదమును బలపరచుచు మలాన్ ప్రభుత్వ విధానమును తీవ్రముగా ఖండించిరి.

యూనియన్ ప్రభుత్వ ప్రతినిధి ఎరిక్ లో తన ప్రసంగమున ఈ క్రింది విషయములను వివరించెను.

నైరృతి ఆఫ్రికా వ్యవహారములగూర్చి విజయలక్ష్మీపండిట్ ఉపన్యసించుచు, బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వ వ్యవహారములనే ఎక్కువగా విమర్శించి ఖండించుటకు పూనుకొనెను. గత మూడు సంవత్సరములనుండియు ఇండియా ప్రభుత్వమువారు బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వముమీద ధ్వజమెత్తుచునే యున్నారు. ఇండియా గవర్నమెంటువారు సాగించుచున్న యీ తీవ్ర నిందారోపణల పంచాంగంతో సభ్యులందరికీ యీవరకే విసుగుపుట్టి యుండగలదు. భారతదేశములోనే సంఘమునుండి చాలామందిని అస్పృశ్యులుగావెలివేయుటయున్ను వారియెడల క్రూరంగా ప్రవర్తించుటయున్ను జరుగుచున్నది. అంతటి సాంఘిక పీడనము ప్రపంచములో ఇంకెక్కడనూ లేదు. భారతదేశములోని ఈ సాంఘిక విచక్షణ వ్యత్యాసములను రూపుమాపుటకు గట్టిప్రయత్నములు చేయబడుచున్నవని యీ సభవారికి ఇండియా ప్రతినిధులు చెప్పవచ్చును. అటువంటి మాటలను చెప్పినందువల్ల ప్రయోజనము లేదు. అట్టి సాంఘిక బహిష్కరణము యీ రోజున ఇండియాలో ప్రత్యక్షంగా అమలులో వున్నది. హైదరాబాదు సంస్థానంమీద ఇండియా గవర్నమెంటు యిటీవల సైనికచర్యలను జరిపి, అచటి ప్రజలమీద విమానాలనుండి బాంబులను వేసిరి. కాశ్మీరులోని వేలకొలది ముసల్మానులను, పంజాబులోను డిల్లీలోనుకూడా వేలకొలది ముసల్మానులను ఇండియాగవర్నమెంటు సంహరిస్తోంది. లక్షలకొలది ముసల్మానులు ఇండ్లు వాకిండ్లు లేకుండా దేశమునుండి వెడలగొట్టబడుచున్నారు. ఇటువంటివి భారతదేశములో జరుగుచుండగా నిర్దాక్షిణ్యముగా దక్షిణాఫ్రికాలో జాతివిచక్షణతోకూడిన జనపీడనము జరుగుచున్నదని ఇండియాప్రభుత్వ ప్రతినిధులు ఉపన్యసించుట ఎంతమాత్రము తగదు. భారతదేశ మిప్పుడు తాకితే పగిలిపోయేటటువంటి అద్దాల భవనము వలెనున్నది.

### స్మట్సు అభయహస్తం ప్రసక్తి

నైరృతి ఆఫ్రికాను బ్రిటిష్ దక్షిణాఫ్రికాలో మిళితముచేసి దానిలో లీనము చేయవలెనని నేను కోరుటలేదు. నైరృతి ఆఫ్రికాకు ప్రత్యేకంగా ఒక శాసనసభ ఏర్పాటుచేయబడును. బ్రిటిష్ దక్షిణాఫ్రికాలో చేరిన రాష్ట్రము తాలూకు శాసనసభలకువుండే అధికార బాధ్యతలకంటె చాలా ఎక్కువైన అధికార బాధ్యతలు నైరృతి ఆఫ్రికాలోని శాసనసభకు కలుగజేయబడును. నైరృతి ఆఫ్రికాను బ్రిటిష్ దక్షిణాఫ్రికాలో అంతర్లీనము చేయుట జరుగదని బ్రిటిష్ దక్షిణాఫ్రికా మాజీ ప్రధాని జనరలు స్మట్సు ఇదివరలో ఒక అభయహస్తము నిచ్చెనని శ్రీమతి విజయలక్ష్మిగారు చెప్పిరి. కాని నేడు నైరృతి ఆఫ్రికాను బ్రిటిష్ దక్షిణాఫ్రికాలోని అంతర్భాగముగా చేర్చివేయుట జరిగినదనియు చేయవలసినదని అంతా చేసివేసి నేను అయిక్యరాజ్యసమితికి సాక్షాత్తుగా యీ విషయమును బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వము నివేదించుచున్నదనియు ఆమె చెప్పెను. ఇది నిరాధారమైన విషయము.

### ఫ్రెంచి ఖండాంతర ప్రాంతాల సామ్యము

నైరృతి ఆఫ్రికా తరపు ప్రతినిధులు కొందరు బ్రిటిషు దక్షిణాఫ్రికా ప్రభుత్వపు యూనియను పార్లమెంటులో సభ్యులుగా నుండగలరు. అట్టి పద్ధతి నవలంబించుటవల్ల నైరృతి ఆఫ్రికాకు ప్రత్యేకంగా ఉండవలసిన ధర్మకర్తృత్వపరిపాలనా విధానమునకు భంగము కలుగజాలదు. అయిక్యరాజ్యసమితియొక్క ఆజ్ఞలను ఉల్లంఘించుట ఎంతమాత్రము కాదు. ఫ్రాన్సు యొక్క పరిపాలన క్రింద నున్న ఖండాంతర ప్రాంతములకు ఫ్రెంచి పార్లమెంటులో ప్రాతినిధ్యము కలదు. కాని, ఆ ఫ్రెంచి ప్రాంతములు ఫ్రాన్సురాజ్యములో చేరిన అంతర్భాగములు కావు. అదేవిధంగా నైరృతి ఆఫ్రికా ప్రాంతము దక్షిణాఫ్రికా యూనియనులో లీనమైనట్లుగా భావింపబడజాలదు. ఈ విషయములను లారెన్సు గారు చేసిన ప్రకటనలో ఇదివరకు విశదీకరించియుండిరి. ఇండియా ప్రతినిధికి యీ విషయములు తెలియును. "నైరృతి ఆఫ్రికాకు యూనియన్ పార్లమెంటులో ప్రాతినిధ్యము నొసంగుటకొరకైన చట్టము" అనే శీర్షికతో వెనుకటి బ్రిటిషు దక్షిణ ఆఫ్రికా ప్రధానిగా నుండిన జనరలు స్మట్సుహయాములో ఒక చిత్తుచట్టము తయారు చేయబడెను. ఆ చట్టముయొక్క నకలు నావద్ద ఉన్నది. బ్రిటిషు దక్షిణ ఆఫ్రికాలోని ప్రజలకు ఏ విధమైన వోటింగు హక్కులుకలవో నైరృతి ఆఫ్రికాలోని ప్రజలకు అట్టి వోటింగు హక్కులే యీ చట్టములో కల్పింపబడెను. ఆఫ్రికా నివాసులగువారికి వోటింగు హక్కులు కల్పింపబడలేదని ఇండియా ప్రతినిధి నిందించుట అసమంజసము. నైరృతి ఆఫ్రికా బ్రిటిషు ధర్మకర్తృత్వాధికారము క్రింద ఉండవలెనని అయిక్యరాజ్య సమితి ఆజ్ఞాపించెను. మొట్టమొదట యివ్వబడిన అయిక్యరాజ్యసమితి తాలూకు ఆజ్ఞాపత్రములోని షరతుల ప్రకారంగా బ్రిటిషు దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వములోని అంతర్భాగముగా నైరృతి ప్రాంతమును చేర్చుకోవచ్చునని అధికార మివ్వబడెను. ఆఫ్రికాఖండ నిజనివాసులకు తగిన గౌరవ ప్రతిపత్తి యొసంగబడుట లేదని యీ సభలో వ్యాఖ్యానములు ఆక్షేపణలు చేయుచున్నారు. కాని ఆఫ్రికా జాతివారి నిజపరిస్థితు లెట్టివో గ్రహించుట లేదు. మరి ఆచార నడవడికలు, వారిలో కల తెగలు, వాటి కట్టుబాట్లు ఎట్టివో గ్రహించుట లేదు. వారు కేవలం అనాగరికులు. అట్టివారికి ఎన్నడూ ఎరుగని వింత రాజకీయ వ్యవహార పద్ధతులను అంటగట్టుటయున్నూ వారికి చిరకాలానుగతముగా వచ్చుచున్న కులకట్టుబాట్లను తొలగించుటయున్ను కష్టమైనపని. అది ఎంతమాత్రము సాధ్యం కాదు.

### సమితిని ధిక్కరించుట లేదు

ధర్మకర్తృత్వ పద్ధతి ననుసరించి నైరృతి ఆఫ్రికాను పరిపాలించుటకు బ్రిటిష్ దక్షిణాఫ్రికా యూనియను ప్రభుత్వం అంగీకరించనందువల్ల ఐక్యరాజ్యసమితిని ధిక్కరించుచున్నదనుటకు వీలులేదు. యూనియను ప్రభుత్వమునకు యుక్తమనితోచిన పద్ధతిని వ్యవహరిస్తోంది.

## విజయలక్ష్మి ప్రసంగమును ఆమోదించెను

పాకిస్థాను ప్రతినిధియగు ముదబ్బీరు హుస్సేను చౌదరి గారు ఉపన్యసించుచు శ్రీమతి విజయలక్ష్మీపండిట్ చెప్పిన విషయములను హర్షించెను. బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యను ఖండించెను. ఐక్యరాజ్యసమితియొక్క అజమాయిషీ క్రింద ఉండి బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వము నైరృతి ఆఫ్రికాను పరిపాలింపవలెననే షరతుకు దక్షిణాఫ్రికా యూనియను ప్రభుత్వము అంగీకరింపకపోవుట అక్రమమని ఖండించెను.

### ఐక్యరాజ్య సమితి బాధ్యత

మాండేటరీ రాజ్యాల ధర్మ పరిపాలన విషయములో అయిక్యరాజ్య సమితి అజమాయిషీ చేయవలసిన బాధ్యత కలదు. ఈ బాధ్యతను తప్పించుకొనుటకు వీలులేదు. నైఋతి ఆఫ్రికాలోని అధిక సంఖ్యాక ప్రజలు దక్షిణాఫ్రికా ప్రభుత్వ పరిపాలనక్రిందనే ఉండుటకు అంగీకరించిరనియు, దక్షిణాఫ్రికా యూనియన్ ప్రభుత్వము అయిక్యరాజ్యసమితి నిర్ణయించిన పద్ధతులననుసరించియే పరిపాలనచేయుచున్నదనియు యూనియన్ ప్రభుత్వ ప్రతినిధి వాదించెను. కాని ఇంత వరకూ ఆ నైఋతిప్రాంత పరిపాలనము ఏ విధముగా జరిగెనో ఎటువంటి అభివృద్ధులు చేయబడెనో ప్రజల హక్కులెంతవరకు భద్రముచేయబడెనో మనమిప్పుడు తెలిసికోవలెను. ఈవిషయములను వివరించు నివేదిక సమర్పింపబడెను. దానిలోని కొన్ని భాగములను ఉదహరిస్తూ ఇండియా ప్రభుత్వ ప్రతినిధి విజయలక్ష్మిగారు చాలా బాగా విమర్శించారు. గత 20 ఏండ్లలోను ఆ నైఋతి ప్రాంత పరిపాలనలో ప్రజాక్షేమార్థమైన అభివృద్ధి ఏమిన్నీ కన్పించుటలేదు. అచట నివసించు యూరోపియనులకు మాత్రమే వోటింగు హక్కులు కలవు. ఆఫ్రికాజాతి వారికి పరిపాలనా సంస్థలలో ప్రాతినిధ్యం లేదు.

అటువంటి స్థితిలో వారు ఉండినప్పుడు వారు ఇంకా అట్టి పరిపాలనలోనే ఉండకోరుట అసంభవం. కనుక ఆ ప్రజల నిజమైన మనోభీష్టము ఎట్టిదో అయిక్య రాజ్య సమితి ఒక కమిటీని నియమించి తెలిసికోవలెను.

బొంబై గవర్నర్ సర్ మహారాజ సింగ్ గారితో కలసి క్రికెట్ పోటీని తిలకించుచున్న గవర్నర్ జనరల్ రాజాజీ.

ప్రస్తుతము డిల్లీలో ఇండియా, వెస్టు ఇండిస్ దీవులమధ్య జరుగుచున్న క్రికెట్ పోటీలో పాల్గొనుచున్న భారతీయ జట్టు కెప్టెన్ అమరనాథ్; వెస్టు ఇండీస్ జట్టు కెప్టెన్ జె. గొడ్డార్డు.

## టెస్టు క్రికెటు

### వెస్టు ఇండీస్ మొత్తం 631

ఢిల్లీ, నవంబరు 12: వెస్టు ఇండీస్, భారత క్రికెటు జట్లమధ్య జరుగుచున్న మొదటి టెస్టు క్రికెటు ఆటలో యీనాటి మూడవరోజున వెస్టు ఇండీస్ జట్టు మొదటి ఇన్నింగు 631 పరుగులకు ముగిసినది. వెస్టు ఇండీస్ వారు నిన్నటి మొత్తానికి 8 పరుగులు మాత్రమే చేర్చగలిగిరి. మిగతా యిద్దరు వెస్టు ఇండీస్ ఆటగాండ్రను రంగాచారియే అవుటుగావించెను. క్రిష్టియాని 107 పరుగులు చేసెను.

అనంతరం భారతీయులు మొదటి ఇన్నింగు ప్రారంభించి ఫలహారం వేళకు ఒకరిని గోల్పోయి 57 పరుగులు గావించియుండిరి. మంకడ్ 5 పరుగులకు అవుటయ్యెను.

## గ్రీసు మంత్రివర్గం

ఏథెన్సు, నవంబరు 11: గ్రీసు ప్రధాన మంత్రి థెమిస్టాక్లస్ సోఫౌలిస్ రేపు మధ్యాహ్నం రాజుగారిని కలుసుకొనుననీ, ఈ సమావేశంలోనే అతను తన మంత్రివర్గం తరపున రాజీనామా దాఖలు చేయగలడనీ తెలియుచున్నది.

విదేశాలలో దిగబడియున్న గ్రీసు శిశువులు-రెడ్ క్రాస్ సంస్థలద్వారా వారివారి స్వగృహాలకు చేర్చివేయవలెనని ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘం నేటిరాత్రి తీర్మానించింది.

## "ఇండియాకు ఇంగ్లీషు సామాన్యభాషగా ఉండాలి"

### సర్ సి. వి. రామన్ ఉపన్యాసం

బెంగుళూరు, నవంబరు 11: నేడు యిచ్చట మహారాణీ సర్కిల్ కళాశాలలో విద్యార్థుల యెదుట ఉపన్యసించుచు, ప్రఖ్యాత శాస్త్రవేత్త సర్ సి. వి. రామన్, ప్రపంచములో సగముమంది ఇంగ్లీషు మాట్లాడుదురనియు, ఇంగ్లీషు ద్వారా మనకు శాస్త్రాదికమైన విజ్ఞానము అబ్బెననియు, ఇంగ్లీషును విడిచిపెట్టినచో మనకు అంతర్జాతీయ నాగరికతా వికాసములతో సంబంధము తొలగిపోవునని ఇంగ్లీషునే మనము సామాన్యభాషగా ఉంచుకొనవలెననియు చెప్పెను. భాషారాష్ట్ర విభజనను విమర్శించుచు, భాషారాష్ట్ర నిర్మాణము ఇండియా ఐక్యతకునూ, హిందీ జాతీయభావ అను సిద్ధాంతమునకును విరుద్ధమని ఆయన చెప్పెను.

## రాజప్రముఖుల సమావేశం వాయిదా

న్యూఢిల్లీ, నవంబరు 11: నవంబర్ 15 వ తేదీన ఢిల్లీలో జరుగవలసిన సంస్థాన యూనియన్ రాజప్రముఖుల సమావేశం అనవధికంగా వాయిదా వేయబడినట్లు తెలియుచున్నది. వివిధ సంస్థానముల సైన్యములను భారత సైన్యముతో సంఘటితపరచవలసిన విషయమును చర్చించుటకు పూనుకొనే యీ లోగా, సంస్థానముల ఆర్థిక వ్యవహారము పరిశీలనకై యిటీవల నియోగింపబడిన సంఘము సమర్పించే తాత్కాలిక నివేదికను భారత ప్రభుత్వం పరిశీలింపవలచినది. బికనీర్, జోధపూర్, జైసల్మీర్లను, రాజస్థాన్ లో చేర్చి విశాల రాజస్థాన్ నిర్మించుటకు సంబంధించిన పథకముగూడా ఒక దరికి వచ్చినది, ఈ పథకము భారత ప్రభుత్వామోదం పొందినట్లయిన, సంస్థాన సైన్యములకు సంబంధించినంతవరకు కొత్త సమస్యలు పొడసూపవచ్చు. అందుచేత యీ సమస్యలన్నీ పరిష్కారమగునంతవరకు సంస్థాన రాజప్రముఖుల సమావేశం వాయిదా వేయుట ఉచితమని భారత ప్రభుత్వం తలంచినది.

## చైనా కమ్యూనిస్టుల విపుల సన్నాహాలు

(1-వ పేజీ తరువాయి)

మడమలో ధూమి కొక్కొంటున్నదనీ రాయిటర్ ఆర్థిక విలేఖరి వ్రాయుచున్నాడు.

యుద్ధపరిస్థితి చక్కబడి ప్రభుత్వం జయించినప్పుడుగాని పరిస్థితి చక్కబడదనీ, ఈలోగా ఎన్ని సంస్కరణలు తెచ్చినా నిరర్థకమేననీ అతని అభిప్రాయం.

నాంకింగ్ వద్ద 40 వేల బందరపుమైళ్లలో మిలిటరీశాసనం విధించినవెంటనే బ్రిటిష్ కాన్సల్ కార్యాలయంవారు షాంఘై నుంచి బ్రిటిషువారిని తరలించుటకు ఏర్పాటుచేయుట ప్రారంభించినారు.

విమానాలలోనూ, నౌకలలోనూ వారు ప్రయాణంచేయుటకు ఏర్పాట్లు చేయబడినవి. ప్రజలు భయభీతులై నగరంవిడిచి పారిపోవుచున్నారు. రోజుకు 30 రైళ్లు చా॥ నడుపుచున్నప్పటికీ చాలుటలేదు. స్టేషన్ లో ఒకసముద్రంలో నలుగురు మరణించినారు. షాంఘైనగరంలో ఇతర ప్రధాన నగరాలలోనూ ఆకలికి తాళలేని ప్రజలు ఆహారపు నిలవలను కొల్లగొట్టుచున్నారు. షాంఘైలో అన్నంకొరత తీర్చుటకుగాను హాంకాంగ్ ప్రభుత్వం 10 వేల టన్నుల బియ్యం ఇచ్చుచున్నది. టీంట్సిన్ నగరంలో మంచూరియానుంచి పారిపోయివచ్చిన సైనికులు హోటళ్ళపైనా, దుకాణాలపైనా దాడులు చేసి కొల్లగొట్టినారు. వారికి అచ్చట ఆహారమిచ్చు ఏర్పాటు ప్రభుత్వం చేయజాలకపోయింది.

భాగి చేసి వెళ్లదలచిన అమెరికనులు తనకు రేపటిలోగా చెప్పవలెనని టీట్సీన్ లోని అమెరికన్ కన్సల్ ఆదేశించెను. టీట్సీన్ నుండి ఒక అమెరికన్ నౌక ప్రయాణమవుచున్నందున, దానిలో కిరికి సౌకర్యములు చేయబడుచున్నవి. షాంఘైలోని విదేశీ ప్రతినిధులు తమ ఏర్పాట్లను తాము చేసుకొనుచున్నారు.

గ్రాండ్ కెనాల్ వద్ద దాదాపు 5 లక్షల మంది కమ్యూనిస్టు సైనికులు సంఖ్యాబలములో తమకన్న చాల తక్కువగనున్న ప్రభుత్వ సేనలపై పోరు సాగించుచున్నవని ప్రభుత్వ మిలిటరీ ప్రతినిధి లెఫ్టినెంట్ జనరల్ టెంగ్ వెన్ యి ప్రకటించుచున్నాడు. పశ్చిమ, ఉత్తర దిశలనుండి ప్రభుత్వ అదనపు సేనలు యుద్ధరంగమునకు చేరనున్నవనీ, విజయసాధన విషయమున ప్రభుత్వమునకు ఎట్టి సంకోచమూ లేదనీ కూడ అనుచున్నాడు.

'గ్రాండ్ కెనాల్' వద్ద జరుగుచున్న యుద్ధములో ప్రభుత్వమునకే విజయము లభ్యమైనపక్షమున మధ్య చైనాను లక్ష్యముగా పెట్టుకొని కమ్యూనిస్టులు సాగించుచున్న విజృంభణను ప్రభుత్వము అరికట్టగచ్చునను వార్తలను సైనిక పరిశీలకులు విశ్వసించుటలేదు. పెంగ్పూ-నాంకింగ్ ప్రాంతమునకు ప్రమాదము ఏర్పడదను వార్తనుకూడ వీరు నిరాకరించుచున్నారు.

మంచూరియాలో విజయము సాధించి ఉత్తరచైనాలో ప్రవేశించిన కమ్యూనిస్టు సైనికదళములు హ్యూపే ప్రాంతముపై బ్రహ్మాండమయిన దండయాత్ర సాగించుటకు "గ్రేట్ వాల్"ను దిగుగ సమాయత్తమగుచున్నవి.

హ్యూపే పశ్చిమ పార్శ్వమున టాంగ్షాన్ బొగ్గుగనుల ప్రాంతములో జరిగిన యుద్ధములో 10 వేలమంది కమ్యూనిస్టుసైనికులు ఓడిపోయినట్లు, ఉత్తర దిక్కున మాత్రము కమ్యూనిస్టులు హ్యూపేకు 10 మైళ్ళదూరములోని చింగ్ వానీ వద్ద అరికట్టబడినట్లు వార్తలు వచ్చుచున్నవి.

## సమితి ఆసియా ఆర్థికశాఖ కార్యాలయం మార్పు

బాంకాక్, నవంబరు 11: ఐక్యరాజ్య సమితి ఆర్థిక సంఘ ఆసియా ప్రాచ్యశాఖ తన కార్యాలయమును, షాంఘై నుండి బాంకాక్ (సయాం)కు మార్చుకొనవచ్చునని తెలియుచున్నది. చైనా అంతర్యుద్ధ పరిస్థితి విషమించుచుండుటే ఇందుకు కారణము.

## ట్రూమనుకు అమెరికన్ భద్రతా సంఘ సిఫార్సులు

వాషింగ్టన్, నవంబరు 11: అమెరికన్ జాతీయ భద్రతామండలి చైనా విషమ పరిస్థితినీ, అమెరికా అనుసరించవలసిన విధానమును పరిశీలించి ట్రూమన్ అధ్యక్షుడికి కొన్ని సిఫార్సులు చేసినట్లు అమెరికన్ విదేశశాఖోద్యోగులు నేడు బయటపెట్టినారు. ఈ సిఫార్సు ఏవో మాత్రము వారు చెప్పలేదు. చాంగ్ కై షేకుకు అధికముగ సైనిక, ఆర్థిక సహాయ మవసరమన్నది వీటిలో వుండవచ్చు. (యు. ప్రె.)

## బియ్యం సప్లయి

లండన్, నవంబరు 11: షాంఘై అధికారులు అవసరముగ విన్నవించుకొన్నందున హాంకాంగ్ నుండి 10 వేల టన్నుల బియ్యము షాంఘైకు రవానా అనుచున్నదని హాంకాంగ్ అధికారులు ప్రకటించుచున్నారు.

## పటేల్ అధ్యక్షతన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశము

### యూరప్ యాత్రపై నెహ్రూ నివేదన

న్యూఢిల్లీ, నవంబరు 12: రాష్ట్రపతి రాజేంద్రబాబు నివాసమున ఈ ఉదయము కాంగ్రెస్ కార్యవర్గసమావేశము మూడు గంటలసేపు జరిగినది. రాజేంద్ర ప్రసాద్ గారి అనారోగ్యము పురస్కరించి హాజరు కానందున సర్దార్ పటేల్ అధ్యక్షత వహించిరి. ప్రధాని నెహ్రూ తన యూరప్ యాత్రను గురించి సభ్యులకు తెలిపిరి. సభ్యులు అడిగిన ప్రశ్నలకు ప్రధానామాత్యుడు జవాబులు యిచ్చిరి.

ఫ్రెంచిపేటలలో ఇటీవల జరిగిన ఎన్నికల ఫలితముగ ఏర్పడిన ఫలితములు చర్చకు వచ్చినట్లు తెలియుచున్నది.

సంస్థాన ప్రజామండలుల ఏర్పాటును గూడ చర్చించిరి.

నెహ్రూ, పటేల్, ఆజాద్, కిద్వాయ్, గోవిందవల్లభపంత్, డా॥ పట్టాభి, రంగా, శంకరరావుదేవ్, ఆచార్య జుగల్ కిశోర్, శ్రీమతి సుచేతా కృపలానీ, ఎస్. కె. పాటిల్, డా॥ ఘోష్, సర్దార్ ప్రతాపసింగ్ గారలు హాజరైరి. ప్రత్యేకాహ్వానముపై జగ్జీవన్ రాంగారు కూడ వచ్చిరి. కార్యవర్గ సభ్యులు తిరిగి రేపు పటేల్ నివాసమున సమావేశ మయ్యెదరు.

## నిజాం సంస్థాన బ్యాంకుకు ఇండియా నాణెముల సరఫరా

హైదరాబాద్, నవంబరు 12: సంస్థానంలో ఉపయోగార్థం ఇంపీరియల్ బ్యాంకు వారు హైదరాబాద్ సంస్థాన బ్యాంకుకు ఒకకోటిరూపాయల ఇండియా నాణెములను పంపుచున్నారని సంస్థాన బ్యాంకు ప్రతినిధి ఒకరు నేడు చెప్పెను. సంస్థానంలో ఏర్పడిన ఇండియా నాణెముల కొరత తాత్కాలికంగా యిది తగ్గించగలదని విశ్వసింపబడుచున్నది.

### బెజవాడకు రావలెనని సర్దారు పటేల్ కాంక్ష

న్యూఢిల్లీ, నవంబరు 9: ఎన్. జి. రంగాగారి కార్యదర్శి ఇట్లు వ్రాయుచున్నాడు:

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు, రంగాగారి ఆహ్వానమును పురస్కరించుకొని, బెజవాడ మొదలైన ఆంధ్ర పట్టణములకు వచ్చుటకు గల తమ కాంక్షను వెలిబుచ్చుచు, భారత ఉప ప్రధాని సర్దారు పటేలుగారిట్లు వ్రాసిరి: "మద్రాసులోని అనేక ప్రదేశములను చూడవలెనని నావగల కుతూహలమును వర్ణింపజాలను. మార్చిలో నేను వ్యాధిగ్రస్తుడను కాకపూర్వము మద్రాసురాష్ట్ర పర్యటనమునకు తలపెట్టియుంటిని. కాని దురదృష్టవశమున వ్యాధికలిగి నాకోరిక నెరవేరలేదు. స్వస్థత చిక్కగానే బెజవాడ మద్రాసులకు తప్పక రాగలను".

రంగాగారి అభినందన లందుకొనుచు పటేలుగారు, "మీరు నన్ను గురించిచూపిన ఆదరాభిమానములకు నేను తన్మయుడనయితిని. ఆంధ్రప్రజలకు నా అభినందన లందజేయండి"

## హైకోర్టు సెషన్సు తీర్పుపై అపీలు

### హైకోర్టులోనే దాఖలుచేయ వచ్చునని ఫుల్ బెంచి తీర్పు

చెన్నపట్నం నవంబరు 12: హైకోర్టు సెషన్సు తీర్పు మీద హైకోర్టులోనే అపీలు చేయుటకు అవకాశము లేదని జనరలుఆసుపత్రి ఆర్. యం. ఓ. హర్ష్యేకేసు శిక్షితుల తరపున దాఖలైన అపీలు పిటిషను సందర్భములో పబ్లికు ప్రాసిక్యూటరు తెలిపిన ప్రిలిమినరీ ఆక్షేపణ విషయమున ప్రధాన న్యాయమూర్తి రాజమన్నార్ గారి నాయకత్వాన ఫుల్ బెంచి తీర్పు నొసగిరి. క్రిమినల్ ప్రొసీజరు కోడుకు సంబంధించే అన్ని విషయములగూర్చి శాసనం చేయుటకు రాజ్యాంగ చట్టము ప్రకారం కేంద్ర శాసనసభకు అధికారము కలదనియు, హైకోర్టు సెషన్సు తీర్పుమీద హైకోర్టులోనే అపీలు చేయుటకు అధికారమిచ్చిన సెక్షను (4) (ఏ) క్రమముగానే గావింపబడినది కావున పబ్లికు ప్రాసిక్యూటరు చేసిన ఆక్షేపణ చెల్లనేరదనియు ప్రధాన న్యాయమూర్తి తెలియ చేస్తూనొసగెను. ఆ పైని ఆర్. యం. ఓ. హర్ష్యేకేసు శిక్షితుల అపీలు ఈ నెల 29 వ తేదీకి వాయిదా వేయబడెను.

## గంటల పంచాంగం

సర్వధారి సం॥ కార్తీక శు॥ ద్వాదశి 1948 సం॥ నవంబరు 13 శనివారం శు॥ ద్వాదశి ఉ 8.28కు, పూ 210.16 వర్జ్యం రా 11 21 ని 1 8 కు.

శు॥ త్రయోదశి నవంబరు 14 ఆదివారం అశ్విని నక్షత్రం రా 10.23 ... 12.31కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి సం॥ కార్తీక శు॥ ద్వాదశి

శనివారం

## సంక్షుభిత చైనా

ద్వితీయ ప్రపంచ సంగ్రామము 1939 వ సంవత్సరము సెప్టెంబరు 1 వ తేదీన జర్మనీ సేనలు పోలెండుపై దండయాత్ర ప్రారంభించిన నాడు గాక, 1931 సెప్టెంబరులో జపాన్ సేనలు మంచూరియా ఆక్రమణ కుప్రక్రమించిన పుడే ప్రారంభమైనదని గత సంగ్రామ చరిత్రకారులు వివరించిరి. వాస్తవమునకు ఆ మంచూరియాయుద్ధమే క్రమముగ యూరప్ ఖండమునకు వ్యాపించినది. 1945 వ సంవత్సరములో యూరపుయుద్ధము ముగిసి, తరువాత కొద్ది మాసములకు జపాన్ యుద్ధముకూడ పరిసమాప్తమైనప్పటికిని యథార్థముగ ద్వితీయ ప్రపంచ సంగ్రామము నేటివరకు ముగించలేదని, ప్రస్తుతము గ్రీస్, చైనా, ఇండోనేషియా, ఇండో-చైనా, మలయా, బర్మా లందు జరుగుచున్న "సాయుధ సంఘర్షణలు" విస్పష్టము చేయుచున్నవి. ద్వితీయ ప్రపంచ సంగ్రామమునకు స్పెయిన్ ఉభయపక్షముల బల ప్రమాణ నిర్ణయములకు రంగమైనట్లు, తృతీయ ప్రపంచ సంగ్రామమునకు చైనా, గ్రీస్ రంగములగుచున్నవని, ఆ దేశముల అంతరంగిక విషయములందు, అంతర్యుద్ధములందు అమెరికా, రష్యాలు ప్రదర్శించుచున్న శ్రద్ధ, ఆసక్తి వెల్లడించుచున్నవి.

ఇంతవరకు గ్రీసు విషయమున రష్యా, రష్యా ఆశ్రితతూర్పు యూరపు రాజ్యములు బహిరంగముగనే జోక్యము కల్గించుకొను చుండెను. చైనా వ్యవహారములలో మాత్రము 1945 వ సంవత్సరములో విదేశాంగ మంత్రుల మాస్కో సమావేశమున చైనా వ్యవహారములను చర్చింపవలెనని రష్యా విదేశాంగ మంత్రి మొలటాప్ ప్రయత్నించి విఫలుడైన అనంతరము, ఇంతవరకు అధికారికముగా ఎట్టి జోక్యము కల్గించుకొనలేదు. మొన్న ఐక్యరాజ్యసమితి రాజకీయ ఉపసంఘ సమావేశమునందు సోవియట్ ప్రతినిధివర్గ నాయకుడు విషిన్‌స్కీ చైనా అంతర్యుద్ధమును గురించి చేసిన ప్రకటననుబట్టి రష్యా 1945 ఒప్పందమును ఇంక మీదట గౌరవింపక చైనా వ్యవహారములలో జోక్యము కల్గించుకొనునని, అవసరమైన త్వరలో మోనాన్ ప్రభుత్వమును గుర్తింపవలెనను ఆందోళనమునుకూడ ఐక్యరాజ్యసమితియందు ప్రారంభింపవచ్చునని భావింపవచ్చును.

మంచూరియాలో చైనా కమ్యూనిస్టులకు రష్యా అనేక విధములతోడ్పడుచున్నదని సమితి రాజకీయసంఘమున చైనా ప్రతినిధి వాదించెను. రష్యా పసిఫిక్ యుద్ధము ముగింపుదశకు వచ్చుచుండిన సమయమున జపాన్‌పై యుద్ధమును ప్రకటించుటలోనూ, అప్పటినుండి కొరియా, మంగోలియాలందును, మంచూరియాలోను అనుసరించు విధానములలోను గల ఆంతర్యమును గ్రహించిన, క్రెమ్లిన్ అధికారులు 1928 వ సంవత్సరములో ప్రారంభించి తాత్కాలికముగ విరమించిన కార్యక్రమమును తిరిగి ప్రారంభింపదలచినట్లు స్పష్టమగుచున్నది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము పశ్చిమ యూరపులో, ప్రధానముగ జర్మనీయందు కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించుటకు జరిగిన ప్రయత్నములు విఫలమగుటతో బోల్షివిక్కులు తమ దృష్టిని ప్రాచ్య, మధ్యప్రాచ్య దేశములపై కేంద్రీకరింపసాగిరి. ఈ ప్రయత్నములు సఫలమగుటకు యుద్ధము, యుద్ధానంతర పరిస్థితులు ఎక్కువ ఉపయోగపడును. బోల్షివిక్కులకు ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము ఆసియాయందట్టి అపూర్వావకాశము లభించినది.

కొరియా, మంచూరియా, మంగోలియాలు దాదాపు రష్యా ఆశ్రిత దేశములైనవి. ఇంక చైనా ఆ మార్గముచే అనుసరించుచున్నది. చాంగ్‌కై షేక్ విధానము రష్యా లక్ష్యసిద్ధికే దోహదము చేయుచున్నట్లు గడచిన అయిదారు మాసములలో చైనా అంతర్యుద్ధములో కలిగిన విపరిణామము స్పష్టముచేయుచున్నది. కనుకనే సోవియటు ప్రతినిధి విషిన్‌స్కీ, చైనాప్రభుత్వము తన సేనలను ఎంతగ వృద్ధిచేసుకొన్నప్పటికిని ప్రయోజనములేదని చైనా స్వాతంత్ర్యముకొరకు జరుగుచున్న ప్రస్తుత యుద్ధములో ప్రజలు గెలుపొందుదురని ప్రకటింపగలిగెను. 1937 వ సంవత్సరములో రాజీప్రయత్నములు విఫలమగుటతో ఉధృతమైన ఈ అంతర్యుద్ధము ఆఖరు ఘట్టమును చేరినదని క్యూమింటాంగ్ ప్రభుత్వ రాజధానియైన నాన్‌కింగ్ పరిసరములలో గత వారముగ జరుగుచున్న ప్రచండ యుద్ధము సూచించుచున్నది. అఖండ చైనాయందలి మూడవ వంతు భూభాగము నేడు కమ్యూనిస్టుల పరమైనది. మంచూరియా నుండి తన సేనలను ఉపసంహరించుకొనుటవల్ల పరిస్థితులు విషమించినట్లు చాంగ్-కై-షేక్ అంగీకరించెను. కమ్యూనిస్టులతో రాజీలేదని కమ్యూనిస్టులను రూపుమాపువరకు యుద్ధమును కొనసాగించెదనని తన నిశ్చయమును వెల్లడించుచు, అథమము ఎనిమిది సంవత్సరము లైనను కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధమును కొనసాగింపవలసి యుండునని ప్రజలు దీర్ఘకాల యుద్ధమునకు సన్నద్ధము కావలెనని విజ్ఞప్తి చేసెను.

క్యూమింటాంగ్ వశమందున్న చైనాలో పరిస్థితులు నానాటికి క్లిష్టమగుచున్నవి. ప్రభుత్వ ధనమునకు విలువలేకుండ పోయినది. క్షుద్బాధితుల సంఖ్య విపరీతముగ పెరిగిపోవుచున్నది. రాజధానియందు అరాచకపరిస్థితులేర్పడినవి. 40 వేల చతురపుమైళ్ల విస్తీర్ణముగల భూభాగముపై చాంగ్-కై-షేక్ ప్రభుత్వము సైనిక శాసనమును అమలు జరిపెనడ. కాని ఇట్టి చర్యలవలన అసలు సమస్యలు పరిష్కారము కాజాలవు. ప్రజలలో అసంతృప్తి ప్రబలిన, ప్రభుత్వము ఒక్కక్షణముకూడ యుద్ధము ... యజాలదు. అమెరికా అపారముగ సైనిక సహాయము చేసినను, ఆ పరికరములను ఉపయోగించుటకు తగిన సైనిక దళములు కూడ ముమ్మరముగ లభింపక పోవచ్చును.

పరిస్థితు లింత అధ్వాన్నముగ నున్నను, ప్రభుత్వ విధానమును మార్చుటకు గాని, ప్రభుత్వ పరిపాలనా యంత్రము నింతకంటె సమర్థముగ చేయుటకుగాని చాంగ్-కై-షేక్ ప్రయత్నింపక పోవుట శోచనీయము. అమెరికా ఆసరా చూచుకొని దీర్ఘకాలపు యుద్ధములో విజయమును సాధించకలుగుదుమని ఆయన భావించిన, అది వట్టి భ్రమే కాగలదు. కాలము వీరికి ప్రతికూలముగ నున్నట్లు గత పది సంవత్సరములు హెచ్చరించుచుండెను. దీర్ఘకాల యుద్ధమును ప్రజలు సహింపరు. కమ్యూనిస్టులతో రాజీ, లేక దేశవిభజన, ఈ రెంటిలో ఏదో ఒకమార్గమునే చాంగ్-కై-షేక్ అనుసరింపవలసివచ్చును. విభజనవలన ఒక్క చైనాకే గాక, ఆగ్నేయ ఆసియాకు అంతకు ప్రమాదపరిస్థితి ఏర్పడగలదు. చైనా పరిణామఫలితములను యావత్తు ఆసియా అనుభవింపక తప్పదు. చైనా సమస్య, అమెరికా విధానమువలన తృతీయ ప్రపంచ సంగ్రామమునకు దారితీయవచ్చును. అట్టి ప్రమాదమును చైనా ప్రజలే నివారింపగలరు.

## శత్రు స్థావరాలపై భారత విమానాల దాడి

### కాశ్మీర్ యుద్ధగతి

న్యూఢిల్లీ, నవంబరు 10: భారతీయసైన్యమునకు చెందిన టెంపెస్టు విమానములు నిన్న కాశ్మీర్‌లో శత్రు ఆక్రమిత ప్రాంతములపై దాడులుజరిపినవి. గిల్గిట్‌కు 40 మైళ్ళు దక్షిణమున ఉన్న థిలాస్‌కోటమరియొక రాకెట్ దాడికి గురి అయినది. గిల్గిట్‌లో ఉన్న శత్రు విమానాశ్రయము పూర్తిగా ధ్వంసము చేయబడినది. 400 బలంగల ఒక శత్రుసమూహంపై పూంచ్ ప్రాంతంలో మన శతఘ్ని దళాలు అగ్నివర్షం కురిపించినవి. మంగళవారం నాడు ఈప్రాంతంలోనే 500 మంది విరోధిసమూహంపై కాల్పులు జరపడం అయినది. శత్రువుకు ప్రాణనష్టం విశేషంగా సంభవించింది. చకోటీ ఉత్తరంగా శత్రువులు మన అగ్రస్థావరములపై తుపాకీగుండ్లు కురిపించిరి. శత్రుదాడిని మన సైన్యములు తిరుగగొట్టినవి.

టిత్వాల్ ప్రాంతంలో మంగళవారం నాడు మన సైన్యములకు శత్రువులకూ జరిగిన 2 పోరాటములలో, 23 గురు ప్రతిపక్షులు నిహతులైనారు. ఈనంతంలోనే మైరగాగీవద్ద మన గస్తీదళములకు 60 మంది శత్రువులు ఎదురైనారు; ఉభయ పక్షులకు తీవ్రమైన పోరాటం జరిగింది.

## జమ్మూ కాశ్మీర్ - మృతవీరుల భార్యా బిడ్డలకు పరిహారం

పాటియాలా, నవంబరు 10: కాశ్మీర్ రంగమున వీరమరణము నొందిన 1 వ పి. ఆర్. యస్. కాల్బల దళములో సైనికుల వారసులకు ఒక్కొక్కరికి 30 'బిగెములు' విస్తీర్ణముగల భూమిని తూర్పుపంజాబ్ సంస్థాన సమాఖ్య సర్వసేనాని, పరిహారం క్రింద బహూకరించియున్నారు.

### మృతవీరులు

ఢిల్లీ, నవంబరు 11: ఈ దిగువ సైనికులు రణక్షేత్రములందు వీరమరణము నందిరని తెలియచేయుటకు భారతప్రభుత్వము మిగుల చింతించుచున్నది:

ప్రతివీరుని మరణవార్తయు వారివారి సంసారములకు కన్నీటితో అందజేయబడినది.

మృతవీరులు:- మగర్‌సింగ్, సోదాగర్‌సింగ్, జగన్‌సింగ్, హ్యార్‌సింగ్, ఉదంసింగ్, పరమానంద్, నాయిక్, ఓంప్రకాశ్, మెహార్‌సింగ్, గోవిందరామ్, కృపారావు, బాచిలర్‌సింగ్.

అంతు తెలియనివారు:- హజంబగుదూర్.

శత్రువుల ఖయిదీలైనవారు:- శ్యామ్ నారాయణ్‌సింగ్, మునిలాల్, పరసేల్‌రామ్, లాల్‌మోహన్.

---

14 న. సాయంకాలం 6 గం. 947 ... నిర్ణయించబడిన కచేరి ... తెలియపరచున్న ... కల్లూరి ... శాస్త్రిగారు ... కార్య ప్రకటన వారి ... జరిపెదరు.

## ప్రత్యేకరాష్ట్రం కోసం సిక్కుల అనుచితాందోళన

### కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో చర్చకు రాగల సూచన

న్యూఢిల్లీ, నవంబరు 11: ప్రత్యేక రాష్ట్రం కొరకు, కేంద్ర, రాష్ట్రశాసన సభలలోనూ, ప్రభుత్వోద్యోగములలో, ప్రత్యేక ప్రాతినిధ్యం కొరకూ, సిక్కులు సాగించుచున్న అనుచిత ఆందోళన, రేపు ఎల్లుండి, కాంగ్రెసు కార్యవర్గ సమావేశములో చర్చకు వచ్చునని తెలియుచున్నది. సిక్కులు రాజ్యాంగపరిషత్తును గూడా నిర్లక్ష్యం చేయుటకు ప్రయత్నించుచున్నారు. ప్రస్తుతం రాజ్యాంగ పరిషత్సమావేశం జరుగుచున్నది. రాష్ట్ర రాజ్యాంగ విధానముల నిర్ణయించే అధికారము, రాష్ట్రముల పునర్విభజించే అధికారము పరిషత్తుకే ఉన్నది. అటువంటప్పుడు, అల్పసంఖ్యాక సంఘ సభ్యులు యిప్పుడు తావు లేదు. అయినప్పటికీ యీ సంఘము యిప్పుడు సమావేశమగుచునే ఉన్నది. ప్రత్యేక రాష్ట్రం కోసం, కేంద్ర, రాష్ట్ర శాసనసభలలోనూ, ప్రభుత్వ ఉద్యోగములలోనూ ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం, రక్షణ, రాకపోకలు, విదేశాంగ వ్యవహారాలు నీటి విషయంలో తమపై కేంద్ర అధికారమును పరిమితం చేయుటకోసం, సిక్కులు సాగించుచున్న ఆందోళన అనుచితమైనదని కాంగ్రెసు వైఖరికి విరుద్ధమని యిక్కడ అభిప్రాయపడుచున్నారు. ఈలోగా 25 మందిసిక్కులు కాంగ్రెసు సభ్యులై, రాష్ట్రకాంగ్రెసు సంఘంలో తమకు సభ్యత్వం కావలెనని అడుగుతున్నారు. రాష్ట్రకాంగ్రెసు సంఘములో మెజారిటీ సంపాదించుటకు వేసిన యెత్తేయిది. ఇంకా యేమి జరుగనున్నదీ యిక్కడ జాగ్రత్తగా కనిపెట్టుచున్నారు.

### మతతత్వ ప్రకోపము, ప్రత్యేక రాష్ట్ర వాంఛ గర్హనీయము

పంజాబు సిక్కులకు ప్రత్యేకరాష్ట్రం కావాలనటమూ, తూ. పంజాబులో కొందరు కోరికోర్కె చాలా అసమంజసమని, లండను భారతీయ కార్మిక సంఘంలోని సిక్కు సభ్యులు తీవ్రముగా గర్హించిరి.

సిక్కులలో మతతత్వ ప్రకోపమును, ప్రత్యేక రాష్ట్రవాంఛను గర్హించుమూ, అఖిలభారత సిక్కు ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి, జనరల్ మోహన్‌సింగ్ యిట్లనెను. "మహాత్మాగాంధీ నాయకత్వం ఫలితంగా అనేక శతాబ్దములనాటి పారతంత్ర్యమునుండి విముక్తిపొంది, భారతదేశం స్వాతంత్ర్యము చేపట్టినది. భారత స్వాతంత్ర్యమును సిక్కులు కొనియాడినట్లయితే, యీ స్వాతంత్ర్యమునకు పునాదియైన మతాతీత విధానమునుగూడా కొనియాడవలయును. అభ్యుదయ సాధనకు అందరము చేయీ చేయీ కలిపి కృషిచేయవలసిన యీ తరుణంలో, అభివృద్ధి నిరోధకులు కొందరు ప్రత్యేక సిక్కు రాష్ట్రమును వాంఛించుచున్నారు. భారతదేశం మతతత్వమునకు అతీతమైన సార్వజనీనరాజ్యము. ఈమహాదాదర్శమును నిలబెట్టుటకు ప్రతివారు పాటుచేయవలెను. కావున నిశ్శంకులై, దేశాభిమానమును పురస్కరించుకొని, సిక్కు సంఘములో మొలకెత్తుచున్న మతతత్వమును నిర్మూలించవలసినదిగా సోదర సిక్కులకు నా విజ్ఞప్తి".

ప్రతి విషయమును మతదృష్టితో పరిశీలించుట, దేశ దౌర్భాగ్యమని, సిక్కు మంత్రులు కొందరు మతపక్షపాతం చూపుతున్నారని జతేదార్ ఉద్ధమసింగ్ అనెను.

సిక్కులకు సంబంధించినంతవరకు భారతరాజ్యాంగ ముసాయిదాను పరిశీలించే నిమిత్తమై, పంథిక్ దర్బార్ నేడు పాటియాలాలో సమావేశమైనది. సమావేశమునకు పాటియాలా మహారాజు అధ్యక్షత వహించెను. మత నియోజకవర్గము లుండరాదని, ఏ జాతిసమష్టి నియోజకవర్గములలో, అల్పసంఖ్యాక వర్గములకు కొంతకాలం వరకూ స్థానములను ప్రత్యేకించవలెనని కోరుచూ కార్యవర్గం ఒక తీర్మానం ఆమోదించినది. మత అహంకార రూపం దాల్చుచున్న రాష్ట్రతత్వమును నిర్మూలించవలసినదిగా ప్రభుత్వమునకు విజ్ఞప్తిచేయవలెనని, కార్యవర్గం నిశ్చయించుకొన్నది.

## కేంద్రప్రభుత్వ ఉద్యోగికిఖైదు

న్యూఢిల్లీ, నవంబరు 11: కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలు సప్లయిశాఖలో స్టాటిస్టికల్ ఆఫీసరు ఉద్యోగి సత్యపాల్ శాస్త్రికు మయిద్‌పురి మేజిస్ట్రేటు ఒక సంవత్సరము కఠిన శైదు, 500 రు. జరిమానా, జరిమానా చెల్లించనిపక్షమున మరి ఆరుమాసాలు కఠిన శిక్ష విధించెను. కాస్టిక్‌సోడా కోటాలను రద్దు చేసెదనని బెదిరించి ప్యాక్టరీలో జమానులవద్ద ఇతడు లంచములు పుచ్చుకొనెనని కేసు వచ్చినది. (యు. ప్రె.)

## నేరములలో సాక్ష్య విచారణ

### క్రొత్త ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, నవంబరు 11: ఇటీవల ప్రభుత్వ ఉద్యోగులపై అవినీతి నేరములకు విచారించవలసివచ్చినప్పుడు, ప్రధానమైన సాక్షులు కొందరు విదేశములలో ఉండడమూ అందువలన కేసు విచారణకు ఆటంకం కలగడమూ అనేకసార్లు సంభవించినది; విదేశములలో ఉన్న వ్యక్తులవద్ద అనేకములలో ఉన్న అధికారులద్వారా సాక్ష్యం సేకరించడానికి ఇదివరకున్న చట్టం ప్రకారం వీలులేకపోయేది. కాని ఇప్పుడు చట్టంలో ఉన్న ఈలోపాన్ని సవరిస్తూ భారత ప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీచేసినది.

## జయపూరు కాంగ్రెసు సమావేశం

బొంబాయి, నవంబరు 11: డిసెంబరు 14 నుండి 20 వరకు జయపూరు కాంగ్రెస్ సమావేశం జరుగును. 16, 17 తేదీలలో విషయనిర్ణయసభలూ, 18, 19 తేదీలలో బహిరంగసభలును జరుగును. విషయనిర్ణయ సభలకు ప్రవేశ రుసుము 25 రు. మొదలు కొని రు 500 రు., బహిరంగ సభలకు రు.10 మొదలు రు 1000 రు. ప్రతినిధుల కొంపులో వసతి సౌకర్యములుయేర్పాటు చేయబడినవి. ఒంటి మనుష్యులకు రు 5 రు. 4 గురు కల కుటుంబమునకు రు 200 రు. 8 గురు కల కుటుంబమునకు రు 125 రు. భోజనము ఒకపూటకు రు 1. ఈ సౌకర్యములు పొందగోరువారు డిసెంబరు 1లోగా ఆహ్వానసంఘమునకు వ్రాయవలెను. కాంగ్రెసు సమావేశములో బాపూజీ గాంధీ నగరులో అఖిలభారత ప్రదర్శనము జరుగును. ఇది వ్యాపారదృష్టితోగాక వైజ్ఞానిక దృష్టితో నడుపబడును.

## తోకచుక్క

మొదట ఆస్ట్రేలియా, ఆఫ్రికా వగైరా దేశముల వారు చూచిన క్రొత్త తోకచుక్కను ఇటీవల మన దేశములో అనేకులు చూచియున్నారు. సబర్మతిలోని మహాత్మాగాంధీ హరిజనాశ్రమములోని వారు గత మూడురోజుల నుండియు ఉదయం 5-30 గంటల నుంచి సూర్యకాంతిలో అదృశ్యమై పోవునరకును తోకచుక్కను చూచుచున్నారు. ఇది కలకత్తా వాసులకు 4-30, 5 గంటల మధ్యకాలములో కనుపించుచున్నది. కలకత్తాలోని ఒక కాలేజీ అబ్జర్వేటరీనుండి గమనించగా ఈ తోకచుక్క తలయందు మొదటి తరగతి నక్షత్రముతో పోల్చదగిన కాంతియు, 4 డిగ్రీలు నిడివిగల తోకయు ఉన్నట్లు తెలిసినది. సింహళములోని కొలంబోనుంచి దీనిని పరిశీలించిన ఒక శాస్త్రజ్ఞుడు దీనితోక 18 డిగ్రీల నిడివి యున్నట్లు చెప్పుచున్నాడు. 1910లో కనుపించిన "హేలీతోకచుక్క"కు దీనికి సామ్యమున్నదని ఒకరు చెప్పిరి.

### చెన్నపట్టణం

మదరాసు, నవంబరు 12: తోకచుక్క నేడు తెల్లవారుఝామున దక్షిణ నైఋతి దిక్కున, శుక్రతారకు కొంచెం దూరంలో, ఆగ ఉదయం మీటియరల జికల శాఖవారికి 4.50 గం. నుండి 5-20 వరకు అగుపడెను.

### బెజవాడ

విజయవాడ, నవంబరు12: ప్రాతఃకాలం 5-20గం. తోకచుక్క శుక్రతారకుదూరంగా అగుపడెను. సుమారు 2 అడుగుల పొడవు కాంతివంతమును తోకతో టార్చిలైటువలె నుండెను. అనేకమంది ప్రజలు దీనిని లెక్కచూచిరి. సాధారణంగా తోకచుక్క కీడును సూచించును, కనుక 3 వ ప్రపంచయుద్ధం వచ్చునేమోనని పలువురు భయపడుచున్నారు.

### తిరుచినాపల్లి

తిరుచునాపల్లిలో నేడుదయం 5 గం. దక్షిణభాగమున ఆకాశంపై తోకచుక్క కనబడి పావుగంటలో మాయమయింది. పెద్దతోక స్పష్టంగా అగుపడెను. స్వ. వి.

## మద్రాస్ ప్రభుత్వ ఉత్తరువు

చెన్నపట్నం, నవంబరు 12: రాష్ట్రములోని సంపాదకులుగాని, ముద్రాపకులుగాని, ప్రచురణకర్తలుగాని నాథూరాం వినాయక గాడ్సే గాంధీజీ హత్యపై కోర్టులో ఇచ్చిన వాఙ్మూలమును ప్రకటింపరాదని ప్రభుత్వమువారు హెచ్చరించుచున్నారు.

## బియ్యం దిగుమతి

కొచిను రేవులో 9 తే 7761 ట. సయాం బియ్యందిగెను. అన్ని తిరువాంకూరు, కొచినులకు పంపబడును. మదరాసు రేవులో 10 తే 1500 ట. బర్మా బియ్యం దిగినది అందు 1000 ట. మదరాసురాష్ట్రానికి, మిగిలినది మైసూరికి.

## వస్త్రాల దిగుమతి

బొంబాయి, బరోడా, అహమ్మదాబాద్, సోలాపూరులయందున్న రాష్ట్రముకొరకు మిల్లులనుండి గుడ్డలు కొనుటకు 36 గురు ప్రతినిధులను ప్రభుత్వంవారు పంపిరి. 25 గురు టోకు వ్యాపారస్థులకు పరపు పరాసరి దిగుమతి చేయబడును.

## అటంబాంబుల నిర్మాణం

### అమెరికాతో రష్యా పోటీ

లండన్, నవంబరు 11: అటంబాంబుల నిర్మాణంలో రష్యా అమెరికాతో పోటీ చేయలేకపోతున్నది. రష్యా ఆక్రమణలో ఉన్న యురేనియం గనులన్నీ నాసిరకమైనవి. అందుచే, పడమటి రాజ్యాలను సవాలుచేయుటకు తగినన్ని అటంబాంబులను రష్యా నిర్మించగలుగుటకు చాలా సంవత్సరములు పట్టవచ్చును. అయితే యిప్పటికి కనీసం 500 అటంబాంబులనైనా నిర్మించి నిల్వచేసి ఉంచుకోవడానికి రష్యా విశ్వప్రయత్నం చేయుచున్నది; యుద్ధం చేయదలచిన ఏ పెద్ద రాజ్యమైన కనీసం 500 బాంబులైనా కలిగి ఉండడం అవసరం అని సైనిక నిపుణులనుచున్నారు. ఇన్ని బాంబులను నిర్మించవలెననే ఉద్దేశ్యంతో, రష్యా, తన ఆక్రమణక్రింద ఉన్న జర్మనీలో, కార్మికులను సమీకరించి వారిచేత బవేరియా, సైలీసియాలలో ఊడిగం చేయించుకొనుచున్నది.

బొహీమియాలో టిరోజ్ పర్వతములలో పెద్దయెత్తున అటంబాంబుల నిర్మాణ కృషి జరుగుతున్నది.

బొహీమియా పర్వతములలో రోజుకు ఒకపౌను యురేనియంమాత్రమే లభించుచున్నదని, సంవత్సరమునకు రెండు అటంబాంబులకన్నా యెక్కువ తయారయ్యే అవకాశంలేదని అక్కడ పనిచేయుచున్న గెర్హార్డ్ రీఫెన్‌స్టాల్ వెల్లడించెను.

## భారతీయ బ్రిటిష్ అణుశాస్త్ర వైజ్ఞానికుల సమావేశం

లండన్, నవంబరు 11: ఇండియా అణుశక్తి కమిషన్ సభ్యులు అయిన డా॥ హెచ్. జె. భాభా, సర్. ఎస్. ఎస్. భట్నాగర్, డా॥ కె. కృష్ణన్ నిన్న ఇండియాభవనంలో బ్రిటిష్ కోశాధ్యక్షుడైన సర్ స్టాఫర్డు క్రిప్సు, బ్రిటన్ అణుశక్తి పరిశోధన సంచాలకుడైన సర్ జాన్ కాక్‌క్రాఫ్టులతో సమావేశము జరిపిరి.

బ్రిటన్‌లో శాస్త్రీయ యంత్ర పరికరములను నిర్మించే పారిశ్రామిక సంస్థలలో కొన్ని ఏర్పాట్లు చేసుకొనుటకు తాము వచ్చితిమని సర్ శాంతిస్వరూప్ భట్నాగర్ రాయిటర్ విలేఖరితో చెప్పెను.

సర్ శాంతి నవంబరు 13 న పారిస్‌కు వెళ్ళి అక్కడనుండి మర్నాడు ఆస్లోకు బయలుదేరి నవంబరు 19 వ తేదీన ఇండియాకు తిరిగివచ్చును.

## పెన్నా - కుముద్వతీ ఒడంబడిక

బెంగుళూరు, నవంబరు 12: మద్రాసు, మైసూరు ప్రభుత్వముల మధ్య జరిగిన పెన్నా-కుముద్వతీ ఒడంబడిక ప్రకారము హిందూపురం తాలూకాలోనున్న పెన్నా కుముద్వతీ సంగమమువద్ద మద్రాసు ప్రభుత్వము ఆనకట్టకట్టుకొనుటకు మైసూర్ ప్రభుత్వ మంగీకరించినది. ఈ ఆనకట్ట రక్షణక్రింద, మద్రాసు రాష్ట్రములోని హిందూపురం తాలూకాలో, 8 పంట చెరువులక్రింద 6000 ఎకరముల భూమి నీటి కొరతలేక రక్షింపబడగలదు. మైసూరు సంస్థానములోని పావగడ తాలూకాలోనున్న ఒక 375 యెకరముల భూమికికూడ ఈ ఆనకట్ట క్రింద రక్షణ నొసంగుటకు మద్రాసు ప్రభుత్వమంగీకరించినది.

ఇందుకు మింజుమలె, నారాయణపురం వద్ద వేదవతీనదిమీద మైసూరు ప్రభుత్వం ఆనకట్ట కట్టుకొనుటకు మద్రాసు ప్రభుత్వ మంగీకరించినది. ఈ ఆనకట్ట క్రింద చిటల్ డ్రగ్ జిల్లాలోని హిరియూర్ తాలూకాలో 2200 ఎకరముల భూమి సాగుకాగలదు. ఇదికాక, ముగురు కొల్వలుత్రవ్వి మైసూరు సంస్థానములోని కొరటిగెరె తాలూకాలోనున్న 2200 ఎకరముల భూమిని రక్షించుటకు మద్రాసు ప్రభుత్వ మంగీకరించినది.

## న్యూయార్కు రేవులో సమ్మె

న్యూయార్కు, నవంబరు 11: వేతనముల తగాదా కారణముగా న్యూయార్కు రేవులోని పదివేలమంది పనివారు నేడు సమ్మెచేసిరి. ఫిలడెల్ఫియా, బోస్టను రేవుల పనివారుకూడా పని మానివేసిరి. సమ్మె ఇతర అమెరికను రేవులకు వ్యాపించవచ్చును. సమ్మెమూలముగా అనేక దేశముల విదేశీయ నౌకలు రేవులలో నిలచిపోయినవి.

## ఇండియాకు కెనడా రైలు ఇంజన్లు

మాంట్రియల్, నవంబరు 11: కెనడాలోని రైలు ఇంజను నిర్మాతలకు ఇండియా ప్రభుత్వం 100 ఇంజన్లకు ఆర్డరు ఇచ్చెను. వానిఖరీదు 130 లక్షల డాలర్లు (సుమారు 4 కోట్ల రూపాయలు) ఇదివరకు ఇంతే ఖరీదుతోకూడిన 100 ఇంజన్లకు ఇటువంటి ఆర్డరు ఇండియా ప్రభుత్వము ఇచ్చియున్నది.

## పాకిస్థాన్ ముస్లిముల దురాగతం

### కాలంబోరా ఫారెస్టు రేంజర్ హత్య

అగర్తలా (త్రిపుర సంస్థానం), నవంబరు 11: త్రిపుర సంస్థానములోని కాలంబోరా అరణ్యశాఖ రేంజర్ హరీశచంద్రదేవుగారిని, వారి అంగరక్షకుడు అనాధబంధునూ, పాకిస్థాన్ ముస్లిములు కొందరు హత్యచేసినట్లు సూచనగా తెలియుచున్నది. నవంబరు మొదటివారములో ఒకనాడు, కొందరు పాకిస్థాన్ ముస్లిం గూండాలు హరీశచంద్రదేవ్ గారివద్దకు వచ్చి, ఏదో అత్యవసర విషయమొకటి మాటాడవలయునని చెప్పి, మోసముజేసి, త్రిపురజిల్లాలోని జమతాలా అను చోటికి తీసుకొని వెళ్ళిరి. అచ్చట ఆయనను, ఆయన అంగరక్షకుని 200 మంది ముస్లిములు చుట్టుముట్టిరి. ఇరువురకు ఒంటినిండ గాయములు తగిలి రక్తము లోడి పోవుచుండగా, అచ్చట నుండి 5 మైళ్ళ దూరములో నున్న మాలీమియా అను ఒక పేరుబడ్డ హంతకుని ఇంటికి కొల్పుడకను యీడ్చుకొనిపోయిరి.

మార్గమధ్యమున, ఎట్లో అవకాశమును కలుగజేసుకొని, హరీశచంద్రగారు, అగర్తలా, కమిలాలకు తాము హింసింపబడుచున్న వార్తను తెలియజేసిరి. కాని లాభము లేకపోయెను. సహాయమును పంపులోపలనే ఆ కిరాతకులు వారిరివ్వరిని చిత్రవధ చేసివేసిరి.

## రాజరిక పునరుద్ధరణ ఫ్రాంకో సుముఖత?

లండన్, నవంబరు 12: స్పెయినులో రాజరికాన్ని తిరిగి నెలకొల్పుటయే తన ఉద్దేశ్యమని స్పెయిన్ నియంత జనరల్ ఫ్రాంకో తనతో చెప్పినట్లుగా బ్రిటిష్ కామన్సుసభలో కార్మికపక్ష సభ్యుడయిన డా॥ మాంట్ ఫాలిక్ తెలియజేస్తున్నాడు. ఈయన ఇదివరకు మాడ్రిడ్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా ఉండేవాడు. ఈయన ఈ మధ్యనే స్పెయిన్‌లో పర్యటించి, జనరల్ ఫ్రాంకోతో గంటన్నరసేపు చర్చించి తిరిగి వచ్చెను.

డా॥ ఫాలిక్ ఫ్రాంకోతో తాను జరిపిన సంభాషణనుగురించి ఈ క్రింది విధముగా తెలియజేసెను:

"పశ్చిమయూరపులో స్పెయిన్‌కు ఉండే సంబంధాలనుగురించి, స్పెయిన్‌లో రాజరికాన్ని పునరుద్ధరించే విషయం మీదనూ నేను ఫ్రాంకోతో సంభాషణలు జరిపితిని. స్పెయిన్ మామూలు పరిస్థితులలోకి రాగలదని ప్రపంచమంతా ఎదురుచూస్తున్నదని నేను ఫ్రాంకోతో అన్నాను. "మామూలు పరిస్థితులంటే ఏమిటి?" అని ఫ్రాంకో ప్రశ్నించెను. "రాజరిక పునరుద్ధరణ" అని నేను జవాబిచ్చితిని. తన ఉద్దేశంకూడా అదేనని ఫ్రాంకో చెప్పగా, అది ఎప్పుడు జరుగుతుందని నేను ప్రశ్నించితిని. తనకూ, రాజరికవాదులకు అత్యంత సముఖ సంబంధాలు ఉన్నవని ఫ్రాంకో చెప్పెను. స్పెయిన్‌లో మామూలు పరిస్థితులను నెలకొల్పుటకు తాను సుముఖుడుగా నున్నట్లు పశ్చిమరాజ్యాలకు సూచించుటకు ఏదైనా చేయవలెనని నేను ఫ్రాంకోకు ప్రతిపాదించగా, "రాజకీయ సంబంధాలను తెంచుకున్నది నేను కాదు. సంబంధాలను తెంచివేసినవారే తమ సద్భావాన్ని మొదట సూచించవలసి ఉంటుంది." అని సమాధానమిచ్చెను. (రాయిటర్)

## ఫ్రెంచి ప్రభుత్వచర్య

పారిస్, నవంబరు 11: స్పెయిన్‌ను ఐక్యరాజ్యసమితిలో చేర్చుకొను విషయమై పశ్చిమరాజ్యాలు తీవ్రంగా ఆలోచిస్తున్నవని ఫ్రెంచి విదేశాంగమంత్రి షూమన్ నిన్న ఫ్రెంచి మంత్రివర్గానికి తెలియజేసినట్లు అభిజ్ఞ వర్గాలవలన తెలియుచున్నది. (యు. ప్రె.)

## కలకత్తా టెలిగ్రాపు ఆఫీసుల భద్రత

కలకత్తా, నవంబరు 11: ... నోస్‌పోస్, బిస్వాల్దా, గార్డెన్ రీచ్ ప్రాంతములలో నున్న వివిధ టెలిఫోను కేంద్రములూ, కలకత్తాలోనూ అక్కడికి 34 మైళ్ళలోను నున్న రూపనారాయణ ప్రాంతంలోను ఉన్న టెలిగ్రాఫు ఆఫీసులున్నూ "సంరక్షిత ప్రదేశములు" అని ప. బెంగాలు ప్రభుత్వము ప్రకటించెను. ఈ ప్రదేశములలోనికి అనుమతి లేక ఎవరూ పోరాదు.

## గూర్ఖా హవల్దారుకు ఉరి

కాన్పూరు, నవంబరు 11: గతిసెప్టెంబరులో అయిదు గురుసైనికులను కాల్చి అందులో నలుగురి ప్రాణాలు తీసిన గూర్ఖా హవల్దారు గంగా సింగ్ అను వానిని నిన్న ఉరితీసిరి.

# గాంధి హత్యకేసు:

## మహాత్ముని ప్రార్థనసభలో శాంతియుత ప్రదర్శనలు జరుపుటకే తాము ఢిల్లీవచ్చినట్లు ఆప్టే ప్రకటన

### వేరు పేర్లతోవ్యవహరించుటకుకారణాలవివరణ

ఢిల్లీ, నవంబర్ 11: గాంధీ హత్య కేసులో ద్వితీయ నిందితుడు నారాయణ ఆప్టేను జడ్జి ఆత్మ చరణ్ నేడు క్రాసు పరీక్ష చేసెను.

ప్రశ్న పరంపరకు సమాధానం చెప్పుచు ఆప్టే ఇట్లన్నాడు. నేను ఆ ప్రూవరు బాడ్గేను 4 ఏండ్ల నుండీ ఎరుగుదును.

హైదరాబాదు స్టేటుకాంగ్రెసు సందర్భంలో బాడ్గే నాకు కొన్ని ఆయుధములు, మందుసామగ్రి ఇచ్చెను. స్టెన్ తుపాకిని 12 రూపాయలకు నాకతడివ్వలేదు."

జడ్జి:-జనవరి 10 వ తేదీన బాడ్గేను హిందూరాష్ట్ర కార్యాలయమునకు తీసుకువెళ్ళి 2 గన్ కాటన్ స్లాబ్‌లు, 5 చేతి బాంబులు ఇవ్వమని అడిగితిని. బాడ్గే ఇచ్చెదనన్నాడు. ఇది నిజమేనా?

జవాబు:-ఇది అంతా అబద్ధము.

మిస్ శాంతా మోడక్‌తో కలిసి పూనా నుండి బొంబాయికి ఒకేపెట్టెలో తాను, గాడ్సే ప్రయాణం చేసినమాట నిజమేనని ఆప్టే ఒప్పుకున్నాడు.

జడ్జి: జనవరి 14 సాయంత్రం నీవు, గాడ్సే, బాడ్గే కలిసి సావర్కార్ ఇంటికి వెళ్లారు. మీతో ప్రేలుడు పదార్థాలసంచి ఉన్నది. 5 లేక 10 నిమిషాలతర్వాత మీరు ముగ్గురూ ఆ సంచితో తిరిగి బయటికి వచ్చారు. ఇది నిజమేనా?

జవాబు: ఇది అబద్ధం. మేమానాడు బాడ్గేను కలుసుకోనేలేదు.

అనంతరము తాను, నాథురామ్‌గాడ్సే, బాడ్గే,దీక్షిత్ మహరాజ్ యింటకి వెళ్లి ప్రేలుడు ద్రవ్యములతో కూడిన సంచిని ఆయన యింటిలో వదలిన మాట నిజము కాదని ఆప్టే చెప్పెను. ఆటు తర్వాత తాను గాడ్సేకు కొంత సైకమిచ్చి నవిషయము, ఆపైకములో గాడ్సే 50 రు బాడ్గేకు అతనియొక్కయు శంకర్ యొక్కయు ప్రయాణ ఖర్చులకుగాను యిచ్చిన విషయముగూడ నిజము కాదని ఆప్టే చెప్పెను.

జనవరి 15 తే తాను గాడ్సే, శంకర్, బాడ్గెలతో శివాజీ ముద్రణాలయమునకు వెళ్లి కార్కెరును కలిసికొన్నమాట, తరువాత జి. ఎమ్. జోషితో మాట్లాడి హిందూమహాసభా కార్యాలయమునకు తిరిగి వచ్చి అచ్చటనుండి మదన్ లాల్ పక్కచుట్టతో సహా టాక్సీలో దీక్షిత్ మహరాజు యింటికివెళ్లి సంచిలోనున్న ప్రేలుడుద్రవ్యములను ఆయనకు చూపగా ఆయన వానిని ఉపయోగించు విధమును తెలియజెప్పినమాట, అంతట తాను ఆ సంచిని ఆయుధములతో సహా కార్కెరు కిచ్చి ఆ సాయంత్రమే ఢిల్లీకి వెళ్ళవలసినదని చెప్పినమాట అబద్ధమని ఆప్టే చెప్పెను.

### జనవరి 15 వ దాదర్ హిందూ మహాసభ కార్యాలయంలో సమావేశం

ఆనాడు జరిగిన విషయమును ఆతడు ఈక్రింది విధముగా వివరించెను: "జనవరి 15 తే గాడ్సే నేను బాడ్గేను దాదరునందలి హిందూమహాసభాకార్యాలయములో కలిసికొంటిమి. ఆకార్యాలయమునకు మేము తరుచుగా వెళ్లుచుంటిమి. బాంబులు యెందుకువచ్చితిరని బాడ్గేమమ్మల నడిగెను. ఇదివరకు మాదిరిగానే ఢిల్లీలో మేము శాంతియుతముగా ప్రదర్శనముచేయ యుద్దేశించుచుంటిమని నేను అతనితో చెప్పితిని. నేనుగూడ ఢిల్లీ రావచ్చునా అని అతడడిగెను. తనవద్ద కొన్ని ఆయుధములున్నవని, ఢిల్లీవచ్చినయెడల తాను వానిని అమ్మకొనవీలగునని ఆయన చెప్పెను. అతడు వచ్చుటకు మాకు అక్షేపణ లేకపోయినను ఆయుధములతోను,ప్రేలుడు సామగ్రితోను వచ్చినయెడల మేము చిక్కులలో పడిపోదుమని మేమాతనితో చెప్పితిమి. అంతట అతడు జనవరి 17 వ మమ్మలను కలిసికొన వాగ్దానము గావించెను. ప్రవీణచంద్ర సేతియాకు అమ్ముటకు తాను ఆ మందుగుండు సామగ్రి, ఆయుధములను సేకరించెనని అతడు మాతో చెప్పియుండెను. హిందూమహాసభా కార్యాలయములో బాడ్గేతోపాటు శంకర్‌ను చూచితినో లేదో నాకు జ్ఞాపకములేదు. దాదర్ హిందూమహాసభా కార్యాలయములో నేను కార్కెరును చూడలేదు. నాథురామ్‌గాడ్సే, నేను తరువాత బాడ్గేను జనవరి 17 తేదీ ఉదయము చూచితిమి.

ప్రశ్న: నాతోకలిసి ఢిల్లీ రా సంసిద్ధుడవుగానున్నావాయని నీవు బాడ్గేను దీక్షిత మహారాజు యింటి ఆవరణలో నాథురామ్ గాడ్సే సమక్షములో అడిగితివిగదా! గాంధిమహాత్ముని, పండిత నెహ్రూను, సుహ్రావర్దీని తుదముట్టించుటకు సవర్కారు నిశ్చయించెనని, ఈ పనిని సవర్కారు నీకు, గాడ్సేకు వప్పజెప్పెనని నీవు అతనితో చెప్పితివిగదా!

ప్ర: ఇదంతా అబద్ధము: తాను చాలా ముఖ్యమైనపనిమీద వెళ్లుచుండెనని దీక్షిత్ మహరాజుతో చెప్పినమాట, ఒకటి రెండు రివాల్వరులను యిమ్మని ఆయనను కోరిన మాట వాస్తవముకాదని ఆప్టే చెప్పెను.

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు తాను, గాడ్సే ఎయిర్ ఇండియా విమానములో జనవరి 17 న బొంబాయి నుండి ఢిల్లీ వెళ్ళినమాట నిజమేనని ఆప్టే చెప్పెను.

### మారుపేర్లతో ప్రయాణం చేయడానికి కారణాలు

మారుపేర్లతో తాము ప్రయాణము చేసినందుకు కారణము తెలియజేయుచు యిట్లనెను: "జనవరి 17 న బొంబాయి నుండి ఢిల్లీ వెళ్లుటకుగాను రెండుసీట్లు రిజర్వుచేయించుకొనుటకు జనవరి 15 న నేనే ఎయిర్ ఇండియా కార్యాలయమునకు వెళ్లితిని. అచ్చట జనవరి 17 తేదీన ప్రయాణము చేయుటకు ఉపయోగపడు టిక్కెట్లు కల ఒకవ్యక్తిని నేను కలసికొంటిని. ఆ టిక్కెట్లు నేను తీసికొంటిని. కర్మార్కర్, ఎన్. మరాఠే అను మారుపేర్లతో గాడ్సే నేను ప్రయాణము చేయుట కిదియే కారణము. బుక్కింగ్ ఆఫీసునుండి సరాసరి టిక్కెట్లు కొని యుండినప్పటికి మారుపేర్లు చెప్పియే నేను వానిని కొనియుండెడివాడను. కారణమేమనగా; మత విద్వేషమును, దౌర్జన్యమును పురికొల్పు యే వ్యాసమునైనను అగ్రాణీ హిందూరాష్ట్ర పత్రికలలో ప్రచురించిన యెడల ప్రభుత్వమువారు పత్రికలనుండి ధరావతు కోరుటతో తృప్తిపడరని, మమ్ము ప్రాసిక్యూటు చేయుదురని ప్రభుత్వమువారు బెదరించి యుండిరి. ఈ కారణముచేత ఢిల్లీలో ప్రదర్శనము చేయునపుడు మేమెవరో యితరులకు తెలియకుండ సంచరింప గోరితిమి.

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు ఆప్టే యిటు చెప్పెను: "జనవరి 17 న నేను గాడ్సే విక్టోరియా టర్మినస్ స్టేషనులో బాడ్గేను కలసికొన్నమాట వాస్తవమే. హిందూరాష్ట్ర పత్రికకును, మా ఢిల్లీ ప్రయాణపు ఖర్చులకును ద్రవ్యము వసూలు చేయుటకు మేమొక టాక్సీ మాట్లాడుకొంటిమి. బొంబాయి డయ్యింగు మిల్సుకు, అఫ్‌జల్‌పూర్కరు, ఎన్. జి. కేలుగారల యిండ్లకు మేము వెళ్లితిమి. హైదరాబాదు పంస్థాన వ్యవహారములకుగాను అఫ్‌జాలు మాకు రూ. 100/- యిచ్చెను. హిందూరాష్ట్ర ప్రకాశన్ లిమిటెడ్‌లో వాటాలు కొనుటకు కేలు మాకు ఒక వేయి రూపాయలిచ్చెను. ఆనాడు మేము సవర్కారు యింటికి, దీక్షిత్ మహరాజ్ యింటికి వెళ్ల లేదు."

### సావర్కార్ దీవెనలకథ అబద్ధం

తామందరు సవర్కారు యింటికివెళ్లి ఆఖరుసారి ఆయన దర్శనము చేసికొనవలెనని గాడ్సే టాక్సీలో సూచించినమాట, అంతట తాను, గాడ్సే, శంకర్, బాడ్గేలు సవర్కారు యింటికివెళ్లినమాట తాను గాడ్సే మిద్దెమీదికివెళ్లినమాట, కొంచెము కాలము గడచినతరువాత సవర్కారుతో కలిసి బయటికివచ్చినమాట యశస్సుతో తిరిగిరావలసినదని సవర్కారు చెప్పినమాట అబద్ధమని ఆప్టే చెప్పెను.

'గాంధికి నూరు సంవత్సరములు నిండినవి. మీపని జయప్రదముగా నెరవేరుననుటకెట్టి సందియమును లేదు, అనిసవర్కారు జోస్యము చెప్పెనని తాను టాక్సీలోఅన్నమాట అబద్ధమని ఆప్టే చెప్పెను. 'బాడ్గేతోసహా నేను బొంబాయి డయ్యింగుమిల్సుకువెళ్లితిని. శంకరు నాతో నుండెనేమో నాకు జ్ఞాపకములేదు. సీగ్రీన్ హోటెలువద్ద నేను నాథురామ్ గాడ్సేను ఎక్కించుకొని ఎయిర్ ఇండియా కార్యాలయమువద్ద వదలితిని. ఆహోటెలుదగ్గర నేను యే స్త్రీని యెక్కించుకొనలేదు. ఆమెను మునిసిపల్ కార్యాలయము యెదుట వదలనూలేదు. నేను దీక్షిత మహరాజుయింటికి వెళ్లలేదు. పిస్తోలు యివ్వమని అడుగలేదు బడ్గేతో సహా నేను శాంతాక్రూజ్, సాంటాక్రూజ్ విమానాశ్రయములకువెళ్లితిని. సాంటాక్రూజ్ విమానాశ్రయమువద్దదిగి, ఆనాడే రాత్రి రైలులో ఢిల్లీకి . యలుదేరవలసినదని బాడ్గేను కోరితిని ఢిల్లీకిరాగానే ఇంపీరియల్ హోటెలులోగాని, మెరీనా హోటెలులోగాని నన్ను కలిసికొనవలసినదని బడ్గేను కోరితిని. బడ్గేకు నేను పైకమేమియు యివ్వలేదు' అని ఆప్టే చెప్పెను.

జనవరి 17 న.ఒక విమానము బొంబాయి నుండి అహమ్మదాబాదువరకు దాదా మహరాజుతో కలసి ప్రయాణము చేసినమాట, ఆయనతో దేశ రాజకీయ పరిస్థితులను చర్చించిన మాట నిజమేయని ఆప్టే చెప్పెను. 'నీవు బోముకోలు రాయడవు, ఇంతవరకు పని యేమి చేసి-ట్లు కనబడదు' అని దాదా మహరాజ్ నాతో చెప్పిన మాట 'మేము ఆ పని చేసినప్పుడు నీవు తెలియగలదు' అని నేను బదులు చెప్పిన మాట నిజముకాదు' అని ఆప్టే చెప్పెను.

మారుపేర్లతో తాను గాడ్సే జనవరి 17 నుండి 20 వరకు మెరీనా హోటెలులో బస చేసిన మాట నిజమేనని ఆప్టే చెప్పెను.

### మెరీనాహోటల్ ఉదంతం

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు ఆప్టే యిట్లనెను: 'జనవరి 20 న బాడ్గే మెరీనా హోటెలుకు వచ్చెను. అనాటి సాయంత్రము బిర్లా భవనము వద్ద ప్రదర్శన చేయ వీలగునేమో చూచుటకు ఆ సాయంత్రము అచ్చటికి రావలసినదని నేనాతని కోరితిని. జనవరి 20 తేదీ ఉదయము నేను బాడ్గే శంకర్లతో బిర్లా భవనమునకు వెళ్లి ప్రార్థనా స్థలములో గాంధి సుహ్రావర్దీలు మామూలుగా కూర్చుండు ప్రదేశమును వారికి చూపిన మాట వాస్తవముకాదు. బాడ్గేకు గవాక్షమును చూపి, దాని గుండా రివాల్వరును, చేతి బాంబును మహాత్మునిపై ప్రయోగింపవలసినదని చెప్పినమాట గూడ వాస్తవము కాదు. సాధ్యమైనంతవరకు గాంధి సుహ్రావర్దీల నిద్దరిని తుదముట్టింప వలెనని చెప్పిన మాట గూడ వాస్తవము కాదు. జనవరి 17 నుండి 20 వరకు నేను గాడ్సే ఢిల్లీయందలి వివిధ శరణాగత శిబిరములకువెళ్లి జనవరి 20 తేదీన బిర్లాభవనమువద్ద ప్రదర్శన చేయుటకుగాను 20, 25 నుండి వాలంటీర్లను చేర్చితిమి.

జనవరి 20 తేదీ ఉదయం నేను గోపాల్ గాడ్సే,శంకర్,బడ్గేలతోసహా రివాల్వరు యెట్లు పనిచేయునో చూచుటకు అడవిలోనికి వెళ్లినమాట వాస్తవము కాదు.

### జనవరి 20 వ తేదీ వృత్తాంతం

బడ్గే, గోపాల్‌గాడ్సే, మదన్లాల్, కేరు, తాను మెరీనాహోటెలు 40 నెంబరు గదికివెళ్లి ఆయుధములను పంచుకొని మారుపేర్లు పెట్టుకొని, బట్టలు మార్చుకొన్నమాట వాస్తవముకాదని, ఆప్టే చెప్పెను. ప్రార్థనాస్థలములో గాడ్సే, తాను సంజ్ఞ చేయవలసినట్లు, మదన్లాల్ గన్‌కాటన్ స్లాబును ప్రేల్చవలసినటు, తక్కినవారు రివాల్వరులను చేతిబాంబులను మహాత్మునిపై ప్రయోగింపవలసినట్లు,బాడ్గే బిర్లాభవనమునందలి నౌకర్ల యిండ్లలో ఒక గదిలోనికి ప్రవేశించి కిటికీగుండా మహాత్మునిపై రివాల్వరు చేతిబాంబు ప్రయోగింపవలసినట్లు మెరీనా హోటలులో వప్పందము జరిగినమాటకూడా వాస్తవము కాదని ఆప్టే చెప్పెను, దాదాపు 4.30 కు తాను మెరీనాహోటెలునుండి బిర్లాభవనమునకు వెళ్లెనని, అప్పుడు నాథురామ్‌గాడ్సే తలకాయనొప్పితో పడుకొని యుండెనని, తాను టాక్సీ మాట్లాడుకొనలేదని, జనవరి 17 వ తేదీనుండి 20 వరకు తాము ఒక ప్రయివేటుకారును ఉపయోగించుకొనుచుండిరని అతడు చెప్పెను. మెరీనాహోటల్‌నుండి బయటికి వచ్చినప్పుడు బాడ్గే శంకర్లను మేము కలిసికొంటిమి. వారిని మాకారులో నెక్కించుకొని బిర్లాభవనమునకు దిడ్డిత్రోవగుండా వెళ్లితిమి. ఇంకా 5 లేక 10 నిమిషములలో ప్రార్థనలు ప్రారంభం కావలసియుండెను. ప్రదర్శన చేయుటకుగాను రావలసినదని మేము కొందరు శరణాగత వాలంటీర్లను కోరియుంటిమి. కాని వారు రాలేదు. ప్రార్థనలు ప్రారంభమైనప్పుడు దూరశ్రవణ యంత్రములు పనిచేయలేదు.తరువాత 5 లేక 10 మంది వాలంటీర్లు నాకు కనబడిరి. ప్రదర్శన చేయుటకు అది సమయముకాదని నేను తలచితిని. అంతట నేను శంకరు మెరీనా హోటెలుకు వెళ్లితిమి. బడ్గే బిర్లాభవనములోనే యుండి ప్రార్థనలకు హాజరయ్యెను. నేను నాథురామ్‌గాడ్సేవద్దకు వెళ్లి జరిగిన సంగతి చెప్పితిని. ప్రదర్శన చేయ వీలుకాకపోయెనని చెప్పితిని.

జనవరి 20 తేదీన బిర్లా భవనములో ప్రేలుడు జరిగినతరువాత తాను, గాడ్సే బాడ్గేను కలిసికొనుటకు హిందూమహాసభా భవనమునకు వెళ్లిన సంగతి నిజముకాదని ఆప్టే చెప్పుచు యిట్లనెను:

### మదన్లాల్‌కు ఆయుధసామగ్రి అమ్మకం

"బాంబు ప్రేలుడు జరిగినతరువాత బాడ్గే మెరీనా హోటెలుకు వచ్చెను. అతడు చాలా భయపడిపోయెను. బిర్లా భవనమువద్ద జరిగిన ప్రేలుడు సందర్భమున మదన్‌లాల్ అను ఒక శరణాగతి అరెస్టు కాబడెనని అతడు నాతో చెప్పెను. మదన్‌లాలుకు తాను కొంత ఆయుధసామగ్రిని అమ్మినట్లు, చెప్పెను. నేను వెంట తీసికొని రావలదని చెప్పినను, ఆ మందుగుండు సామగ్రిని, ఆయుధములను తెచ్చినందుకు అతడు సంతాపము వెలిబుచ్చెను ఢిల్లీలో నుండుట క్షేమముకాకపోవుటచే సరాసరి తాను పూనా వెళ్లగోరుచుండెనని అతడు నాతో చెప్పెను. తరువాత నేను యింకను పడుకొనియున్న నాథురామ్‌గాడ్సే వద్దకు వెళ్లి బాడ్గే చెప్పిన దానినంతటికి అతనికి తెలిపితిని. ఢిల్లీలో నుండుట క్షేమముకాకపోవుటచేత అచ్చటి నుండి వెంటనే వెళ్లిపోవ నేను గాడ్సే నిర్ణయించుకొంటిమి. మదన్‌లాలు బడ్గే పేరు తెలుపవచ్చును. బడ్గే అరెస్టయిన యెడల ప్రదర్శన చేయుటకు మేము ముగ్గురము ఢిల్లీకి కలిసివచ్చుటచేత అతడు మా యిద్దరి పేర్లు తెలుపవచ్చును. ఈవిధముగా ఆలోచించి మేము వెంటనే ఢిల్లీనుండి వెళ్లిపోవ నిర్ణయించితిమి."

ఆప్టేను ప్రశ్నలు వేయుట పూర్తికాకముందే విచారణ రేపటికి వాయిదాపడినది.

## గాడ్సే వాఙ్మూలము ప్రకటింపరాదు

### బొంబాయి ప్రభుత్వ శాసనం

బొంబాయి, నవంబరు 11: విచారణ సమయమున నాథూరాం వినాయక్‌గాడ్సే ఇచ్చిన వాఙ్మూలమును ఏ రూపముననూ ప్రకటింపకూడదని, ప్రజారక్షణ చట్టముగా, నేడొక శాసనమును ప్రకటించినది. ఈ శాసనము బొంబాయి రాష్ట్రములోని, అన్ని పత్రికలకు వర్తించును.

## నేషనల్ సేవింగ్సు క్రొత్తస్కీము

### శ్రీ ఆర్గనైజర్లను, జిల్లా ఆర్గనైజర్లను ఎన్నుకొనుట

మద్రాసు ప్రావిన్షియల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసరు ఇలా వ్రాస్తున్నారు:—

ఆర్గనైజర్లకు అభ్యర్థులను ఎన్నుకొనుటకుగాను ఇండియా నేషనల్ సేవింగ్సు కమిషనరు శ్రీ కె. ఆర్. మెహతాగారు 17-వ తేది సాయంత్రం మద్రాసు వచ్చెదరు.

నేషనల్ సేవింగ్సు క్రొత్తస్కీము ప్రకారం ముగ్గురు శ్రీఆర్గనైజర్లు 35 గురు జిల్లా ఆర్గనైజరు నియమింపబడెదరు. కలెక్టర్లును, ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజి వారును పంపిన పేర్లజాబితాలనుండియు, అడ్వర్టయిజ్మెంటు చేయగా వచ్చిన దరఖాస్తుల నుండియు అభ్యర్థులు సెలెక్టుచేసికొనబడుదురు. ముందు కొద్దిరోజులు, ప్రతి స్థానమునకును కొంత మంది పేర్లనుఎన్నుకొని ఇండియానేషనల్ సేవింగ్సుకమిషనరుయెదుట పెట్టుటకుగాను ప్రావిన్షియల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసరున్ను, డిప్యూటీ ప్రావిన్షియల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసరున్ను రాష్ట్రమున పర్యటన చేసెదరు. శ్రీ కె.ఆర్. మెహతాగారు ఈ అభ్యర్థులను, కలెక్టర్లు, ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజివారు సిఫారసు చేసిన అభ్యర్థులను, ఈనెల 18, 19-వ తేదీలను మద్రాసులోను, 20, 21-వ తేదిలను తిరుచినాపల్లిలోను, 23, 24వ తేదిలను విజయవాడలోను ఇంటర్వ్యూ చేసెదరు.















Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.